Namaaz
(Telugu)

జీవితానికి వెలుగుబాట

# నమాజ్

మూలం :
మౌలానా అబూ సలీం అబ్దుల్ హై

అనువాదం :
షేఖ్ హమీదుల్లా షరీఫ్, బి.ఏ.

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్

# దైవ సూక్తి

"ఇన్నస్సలాత తన్హా అనిల్ ఫహ్షా ఇవల్ మున్కర్"

"నిస్సందేహంగా నమాజ్ మానవుణ్ణి దుశ్శీలాన్నుండి, దుర్మార్గాన్నుండి కాపాడుతుంది." దేవుని ఈ అమర వాక్కును మీ ముందు ఉంచుకోండి. దీన్ని ఆధారంగా పెట్టుకుని, మీ జీవితాన్ని, మీ నమాజుల్ని పరీక్షించుకోండి, తూచుకోండి. మీరు మీ జీవితంలో దిన దినం ఒక నూతనమయిన విప్లవాత్మకమయిన మార్పును చూడగలరు.

దైవ విద్రోహికి, దైవ విధేయునికి మధ్య చాలా వ్యత్యాసం ఉంటుంది. వీరిద్దరి జీవితాలు ఒకే విధంగా ఉండవు. ఇదే భేదం నమాజ్ (దైవప్రార్థన) చేసే మనిషిలో, చేయని మనిషిలో ఉండాలి. నమాజ్ చేసే మనిషి మనఃపూర్వకముగా దైవ వ్యతిరేకమైన ఏ పనీ చేయడు. అన్యాయం, మోసం, వంచన, అసత్యం, దౌర్జన్యం, హింస, దైవ నియమాలను ధిక్కరించడం, దైవవిద్రోహులకు విధేయుడై జీవించడం మొదలైన దుష్కార్యాలను నమాజ్ చేసే మనిషి చేయలేడు. నమాజ్ చేసే ఏ వ్యక్తిజీవితమైనా, ఈ లోపాలకు, దుర్గుణాలకు అతీతంగా ఉండకపోతే, అతడు చేసే నమాజ్ కేవలం సాంప్రదాయకమైనది మాత్రమే కాని, నిజమైన, దైవభక్తి పూరితమైన నమాజ్ కాదు. ఆలోచించకుండా, అర్థం చేసుకోకుండా చేసే నమాజ్ ఒక ఆచారంగా మాత్రమే ఉండిపోతుంది. దీనివల్ల ముస్లిమ్‌లకు కలుగవలసిన ప్రయోజనం కలుగదు.

# ముందుమాట

**అరబ్బీ, ఉర్దూ భాషలు** రానివారు, వాటి లిపిని ఎరుగని వారు ఎంతోమంది ఉన్నారు. వారు కేవలం తెలుగు భాషనే చదివి అర్థం చేసుకోగలరు. అలాంటి వారికి ఇస్లామీయ ధర్మోపదేశాలను తెలుపటానికి అత్యుత్తమము అత్యంత సులభము అయిన పద్ధతి, వారికి తెలిసిన, వారు చదివి అర్థం చేసుకోగలిగిన భాషలో అవసరమయిన ఇస్లామీయ సాహిత్యాన్ని అంద జేయటం, దీనివల్ల తెలుగు వచ్చినవారికి ఎక్కువలాభం కలగటమే కాకుండా, ఇస్లామీయ సాహిత్యంలో ఒక నూతనాధ్యాయం ప్రారంభం కావచ్చు.

సుప్రసిద్ధ ఉర్దూ రచయిత, ప్రముఖ ఉర్దూ పత్రిక "అల్ హసనాత్" (రాంపూర్, ఉత్తరప్రదేశ్) సంపాదకులు అయిన మౌలానా అబూసలీమ్ అబ్దుల్ హై గారి "నమాజ్" తెలుగు అనువాదాన్ని ఆంధ్ర ప్రజలకు అందజేస్తున్న ఈ ప్రయత్నం ప్రశంసనీయమయినది. ఈ పుస్తకానికున్న కొన్ని ప్రత్యేకతలవల్ల ఉర్దూ సాహిత్యంలో దీనికి ఒక విశిష్టస్థానం లభ్యమయింది. దీన్ని తెలుగులో కనువదించిన శ్రీ హమీదుల్లా షరీఫ్ సమర్థతగల తెలుగు అనువాదకుడు.

ఈ పుస్తకం అందరికీ ప్రియతమం కావాలని, అందరికీ దీనివల్ల ప్రయోజనం కలగాలని నేను దైవంతో ప్రార్థిస్తున్నాను.

**ముహమ్మద్ అబ్దుర్రజ్జాఖ్ లతీఫీ**

జమాఅతె ఇస్లామీ హింద్ అధ్యక్షులు,
ఆంధ్రప్రదేశ్

హైదరాబాద్
5 - 8 - 1968

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# 1

పెద్ద పెద్ద గ్రంథాలు చదివి అర్థం చేసుకోలేని మిత్రుల కోసం ఈ పుస్తకం వ్రాయబడింది. దీన్ని చదివి వారు చాలా సంతోషిస్తారు. నమాజ్ చేసే విధానాన్ని నేర్చుకోగలుగుతారు. నమాజ్ అన్నింటికంటే మహత్తరమైన ఆరాధన. మానవుడు తన జీవితాన్ని దైవానికంకితంచేసి, దైవదాస్యంలో గడపాలనుకుంటే అది నమాజ్ ద్వారానే సాధ్యమవుతుంది. నమాజ్ చేసేటప్పుడు మీరు ఏమేమి పఠిస్తారో వాటిని అర్థం చేసుకున్నప్పుడే నమాజ్ వల్ల మీకు సంపూర్ణ లాభం కలుగుతుంది. కనుక మీరు చదివే దాన్నర్థం చేసుకుని మరీ చదవండి. మీ నోటినుండి వచ్చే ప్రతి మాటను మీరు అల్లాహ్‌తో అంటున్నామని తెలుసుకుని నమాజ్ చేస్తే మనిషి జీవితంలో అచిర కాలంలోనే అద్వితీయమయిన మార్పు వస్తుంది. అతను ఒక నిజమయిన ముస్లిమ్ అని అతని పూర్తి జీవితం సాక్ష్యమిస్తుంది. అతనిలో ఇంతవరకు ఉన్న దుర్గుణాలు, దురభ్యాసాలు అతన్ని వదిలిపోతాయి. అతని నడవడికలో, భావాల్లో ఒక నూతన సంస్కారం భాసిస్తుంది. అతని మాటలో నిజం, అతని చేతలో న్యాయం తొణికిస లాడుతాయి. కలహాలకు, కల్లోలాలకు,

దుర్మార్గాలకు దూరంగా ఉంటాడు. ఒక్కమాటలో చెప్పాలంటే ఆ మనిషిలో మంచి అధికమై చెడు తగ్గుతుంది.

ఈ పుస్తకంలో నమాజ్ అర్థం, దాని ప్రాముఖ్యం సులభమయిన భాషలో తెలుపబడ్డాయి. దీన్ని చదివి అర్థం చేసుకొని జ్ఞాపకముంచుకోండి, ఇది చాలా సులువైనపని. మీరు చేసే ప్రతి నమాజ్‌ను అర్థం చేసుకొని మరీ చేయండి. ఈ విధంగా నమాజ్ చేయడంవల్ల కలిగే ప్రయోజనాలు యాదృచ్ఛికాలు అనుకోవద్దు. మీరే స్వయంగా ఆలోచించినట్లయితే అసలు విషయాన్ని సులభంగా గ్రహిస్తారు.

కొంచెం ఆలోచించండి – ఉదయాన్నే పెందలకడలేచి పరిశుభ్రమయిన (వుజూ చేసుకుని) పరిశుద్ధమయిన మనస్సుతో దైవ సాన్నిధ్యంలో హాజరై ఆయన ముందు గౌరవంతో చేతులు కట్టుకొని నిలబడి, ఎంతో వినయపూర్వకంగా శరీరాన్ని వంచి, భయభక్తులతో శిరస్సు భూమిపై పెట్టి, "ప్రభూ ! నేను నీ బానిసను" అని హృదయ పూర్వకంగా అంటూ అల్లాహ్ను సహాయం చేయమని వేడుకుంటారు, సరియైన మార్గం చూపమని ప్రార్థిస్తారు. "దైవమే నా నిజమయిన ప్రభువు, నా యజమాని, ఈ జీవితం అంతమయ్యే వరకు దైవదాసునిగా, దైవ విధేయునిగా ఉంటాను" అని ముస్లిమ్ అయినపుడు చేసిన ప్రమాణాన్ని పునశ్చరణ చేసుకుంటారు. "దేవా ! నీ ప్రసన్నతను చేకూర్చే పనులు చేయటానికి కావలసిన శక్తి సామర్థ్యాలను మాకు ప్రసాదించు, నీ ఆగ్రహానికి కారణభూతమయ్యే పనుల నుండి మమ్మల్ని రక్షించు" అని అర్థిస్తారు, దైవప్రవక్త మానవాళి కందజేసిన సందేశం యథార్థమయిందని సాక్ష్యమిస్తారు, దేవుని న్యాయస్థానంలో హాజరై తమ మంచిచెడుల ప్రతిఫలాన్ని పొందే ఆ అంతిమ దినాన్ని జ్ఞాపకం చేసుకుంటారు.

ఈ విధంగా మీ దినచర్య ప్రారంభమవుతుంది, మీ పనుల్లో మీరు

నిమగ్నులౌతారు. ఆలోచించదగ్గ విషయమేమంటే ఏ మనిషి దినచర్య ఈ విధంగా ప్రారంభమవుతుందో అతడు ఈ దిగువ చూపిన పనులు చేస్తాడంటే నమ్మగలమా?

★ అల్లాహ్ అభీష్టానికి ప్రతికూలంగా ఇతరులకు బానిసలయి వారి ఆజ్ఞలను పాలిస్తూ తన జీవితాన్ని గడపటం.

★ తన కోరికలను తీర్చమని ఇతరుల్ని అర్థించడం, వారినే తన ప్రభువులుగా, యజమానులుగా ఎంచడం.

★ ఇతరుల్ని కష్టాలనుండి గట్టెక్కించేవారుగా, సుఖశాంతుల్ని ప్రసాదించే వారుగా, ఆపద సమయాల్లో ఆదుకునేవారుగా తలంచి వారి సహాయ మర్థించడం.

★ దైవం నిర్ణయించిన హలాల్, హరామ్ (ధర్మసమ్మతమయినవీ, ధర్మసమ్మతం కానివి) హద్దులను విచక్షణ చేయకుండా జీవితావసర వస్తువులను సంపాదించడం, ఇతరుల హక్కుల్ని కాజేయడం.

★ అన్యాయంగా, దురుద్దేశ్యంతో ఇతరుల సొమ్మును అపహరించడం.

★ అసహ్యము, అశుద్ధము, అసభ్యము అయిన చర్యల్లో పాల్గొనడం.

★ పరాత్పరుడు చూపిన పవిత్ర మార్గాన్ని కాదని, ఇతరులు చూపిన మార్గంపై నడుస్తూ జీవితాన్ని గడపడం.

భక్తి శ్రద్ధలతో నమాజ్ చేసేవ్యక్తి అవాంఛనీయమైన ఈ పనులు చేయడు అని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఉదయం నమాజ్ తరువాత మీరు మీ మీ పనుల్లో కొన్ని గంటల వరకు నిమగ్నులౌతారు. మళ్ళీ కొన్ని నిమిషాల కొరకు మీ ప్రభువు

దర్బారులో హాజరౌతారు. సూర్యోదయాన్నుండి ఇప్పటివరకు మీ వల్ల ఏదన్నా పొరపాటు జరిగితే, దానికి చింతిస్తూ పశ్చాత్తాపపడతారు. ఉదయం నమాజ్‌లో చేసిన ప్రమాణాన్ని, వాగ్దానాన్ని జ్ఞాపకం చేసుకుంటారు. ఈ విధంగా మీరు మీ విశ్వాసాన్ని తాజా చేసుకుని మళ్ళీ మీ మీ పనుల్లో లీనమయిపోతారు. కొన్ని గంటల కాలం గడచిన తరువాత మళ్ళీ అదే ప్రమాణాన్ని తాజా చేసుకుంటారు. మీ దినచర్య ఈ విధంగా ముగుస్తుంది. (అంటే ఉదయం, మధ్యాహ్నం, సూర్యాస్తమయానికి ముందు చేసే నమాజులు అని అర్థం). రాత్రి వస్తుంది, తిరిగి మీరు మీ విశ్వాసాన్ని మళ్ళీ గుర్తు చేసుకుంటారు. చివరిసారిగా నిదురపోయే ముందు మీరు మీ ప్రభువుతో ఉదయం లేవగానే చేసిన ప్రమాణాన్ని మళ్ళీ చేస్తారు. (రాత్రి నమాజులు అని అర్థం).

ఏ మనిషి జీవితంలో రేయింబవళ్ళు ఈ విధంగా గడుస్తాయో అతనిలో మార్పురాకుండా ఉండటం అసంభవం. వాని నమాజ్‌ను కేవలం వంశపారంపర్యంగా వచ్చే ఆచారంగా, ఒక అలవాటుగా ఎంచి, ఆలోచించకుండా, అర్థంచేసుకోకుండా చేస్తే, అతని జీవితంలో కావలసిన, రావలసిన మార్పురాదు. చేయవలసిన క్రమాన్ని, విధానాన్ని అర్థంచేసుకుని చేస్తే నమాజ్ నిస్సందేహంగా మనిషిని చెడునుండి, దుర్మార్గాన్నుండి రక్షిస్తుంది.



# 2

ఎందరో దైవప్రవక్తలు ఈ భూమిపై ప్రభవించారు. దైవాన్ని, దైవగ్రంథాన్ని, దైవప్రవక్తల్ని ప్రజలు నమ్మటం లేదు. కాబట్టి వారు వచ్చింది కేవలం ప్రజలను నమ్మేటట్లు చేయటానికి కాదు. మానవుడు తన నిజమైన ప్రభువును, యజమానిని గుర్తించేటట్లు చేయడం, స్వర్గనరకాలు, తుది దినం, మానవుడు చేసిన మంచిచెడుల ప్రతిఫలం, దైవదూతలు ఇత్యాది విషయాలను మానవులకు తెలుపడం, ఈ విషయాలను గుర్తించి స్వీకరించిన ప్రజల జీవితాల్ని దైవం చూపిన మార్గానుసారం చక్కదిద్దటం. ఇది వారి జీవిత లక్ష్యం. చివరి దైవప్రవక్త తెలిపిన మాటలపై నాకు విశ్వాసం ఉందని ఎవరన్నా అంటే, వారు ఖుర్‌ఆన్‌ను దైవ గ్రంథంగా గుర్తించారని, వారికి అంత్యదినంపై పరిపూర్ణ విశ్వాసం ఉందని అర్థం. ఈ ప్రకటన, ఈ ప్రమాణంచేసిన వ్యక్తి దీని తరువాత తాను ఏ ఏ పనుల్ని చేయాలో, వాటిని చేయటానికి హృదయపూర్వకంగా ఉపక్రమించకపోతే, తన ఈ జ్ఞానం తన జీవితానికి ఏ విధంగాను ఉపయోగపడదు. ఉదాహరణకు జ్వరంతో బాధపడుతున్న ఒక మనిషికి క్వినైన్ మాత్రలు తింటే తన జ్వరం పోతుందని తెలుసు. ఆ మందుపై అతనికి అచంచల విశ్వాసముంది. కాని అవి చేదుగా ఉండటం వల్ల వాటిని అతడు సేవించడు. కేవలం మందుపై ఉన్న ప్రగాఢ నమ్మకం తన జ్వరం పోవడానికి ఏ విధంగాను సహాయకారి కాదు. అంటే ఆ మందు చేదుగా ఉన్నప్పటికీ దాన్ని వాడి, దానిపై తనకున్న నమ్మకాన్ని క్రియారూపంలో పెట్టినపుడే సత్ఫలితాలు పొందగలడు. ఇంకా, బాగా ఆలోచించినట్లయితే విషయం విపులంగా అర్థమవుతుంది. ఏ విషయం

మీదనయినా మీకు మనస్సులో సంపూర్ణ విశ్వాసం ఉంటే దాని ప్రభావం తప్పకుండా మీ జీవితంపై పడుతుంది. ఉదాహరణకు నిప్పును తీసుకోండి. నిప్పులో చేయి పెడితే కాలుతుందని మనకు తెలుసు. కనుక మనం తెలిసి నిప్పులో చేయిపెట్టం. దేవుడున్నాడని మీరు హృదయపూర్వకంగా విశ్వసిస్తారు. మానవులకు మంచి మార్గం చూపటానికి ఆయన ప్రవక్తల్ని పంపాడని కూడా మీకు తెలుసు. ముహమ్మద్(సఅసం) నిజమైన దైవప్రవక్త. ఆయన చెప్పిన ప్రతిమాట నమ్మదగ్గది, శిరసావహించదగ్గది అని నమ్ముతారు. మీ ప్రభువు, తాను తన ప్రవక్తల ద్వారా పంపిన ఉపదేశాల కనుగుణంగా జీవితాన్ని గడిపారా, లేదా అని ఒకరోజున మిమ్మల్ని ప్రశ్నిస్తాడని మీకు తెలుసు. మీరు ఈ ప్రపంచంలో చేసిన పనుల ప్రకారం మీ ప్రభువు మీకు ప్రతిఫలం ఇస్తాడని కూడా మీకు జ్ఞానముంది. ఇన్ని విషయాలు తెలుసుండి కూడా దైవాదేశాలకు, దైవోపదేశాలకు వ్యతిరేకంగా మీరు ఏవిధంగా జీవించ గలుగుతారో చెప్పండి. మీ ఈ జ్ఞానం మీ జీవితంలో ప్రస్ఫుటం కాకపోతే దాని అర్థమేమంటే, పై విషయాలపై మీకు పరిపూర్ణ విశ్వాసం లేకుండా అయినా ఉండాలి లేక మీరు ఎంతో అసమర్థులవడం చేత ఒక విషయాన్ని సరయినదని విశ్వసించినా మీరు చేసే ప్రతి పని దానికి వ్యతిరేకంగానే ఉంటుంది. ఇలాంటి వ్యక్తి వాస్తవంగా నమ్మదగ్గవాడు కాడు. ఏ విషయంలోను ఇతన్ని మనం నమ్మలేము. ఇస్లామ్‌లో ఇలాంటి వారికి స్థానం లేదు.

ఒక మనిషి ఇస్లామ్‌ను విశ్వసించిన తరువాత విధిగా చేయవలసిన పని నమాజ్. "ఇస్లామ్" ధర్మానికి నమాజ్ స్థంభం లాంటిది. దాన్ని నిలిపిన వ్యక్తి ఇస్లామ్ ధర్మాన్ని స్థాపించాడు. నమాజ్‌ను విసర్జించిన వ్యక్తి తన ధర్మాన్ని కూలద్రోశాడు అని దైవప్రవక్త (సఅసం) అన్నారు. "నమాజ్ పిలుపు (అజాన్) విని, నమాజ్‌కు రాని వాని ఇంటికి నిప్పు పెట్టాలని నా మనస్సు

కోరుతుంది" అని కూడా దైవప్రవక్త అన్నారు. ముస్లిమ్‌కు, కాఫిర్‌కు ఉన్న భేదాన్ని వివరిస్తూ దైవప్రవక్త, ముస్లిమ్ నమాజ్ చేస్తాడు, కాఫిర్ చేయడు అని చెప్పారు.

ఆ కాలంలో నమాజ్ చేయటానికి మస్జిద్‌కు రాని వానిని ముస్లిమ్‌గా పరిగణించేవారు కారు. దీనివల్ల మనకు తెలిసేది ఏమంటే, నమాజ్ చేయనివాడు ఇస్లామ్ దృష్టిలో ముస్లిమ్‌గా ఎంచబడటానికి అర్హుడుకాడు. ఇస్లాం కేవలం ఒక సిద్ధాంతం మాత్రమే కాదు. విశ్వాసం, విశ్వసించిన దానిని తు. చ. తప్పకుండా ఆచరించడం – ఈ రెంటి సమన్వయమే ఇస్లామ్. దైవాజ్ఞల్ని శిరసావహించి, వాటికనుగుణంగా తన జీవితాన్ని గడపటానికి ఇష్టపడని వ్యక్తి ఇస్లామ్ దృష్టిలో నిష్ప్రయోజకుడు. అలాంటి వారికి నమాజ్‌లాంటి సులభమైన పని పెద్దభారంగా కన్పిస్తుంది. వారివల్ల ఇస్లామ్‌కు ఉపయోగం కలుగుతుందని ఆశించటానికి ఏ మాత్రం వీలులేదు. దైవదాస్యం, దైవాజ్ఞాపాలన చేసి తరించడానికి సిద్ధం కాని వారికే నమాజ్ బరువుగా కనిపిస్తుంది. దైవధిక్కారులకు, దైవవిధేయులకు మధ్య అనంతమయిన వ్యత్యాసం ఉంటుంది. వీరి జీవితాలు ఒకేవిధంగా ఉండవు. ఇదే భేదం, నమాజ్ చేసే మనిషికీ, చేయని మనిషికి ఉంటుంది. దైవవిధేయుడు తెలిసి, చేయాలని దైవ వ్యతిరేకమైన పని ఏదీ చేయడు. అన్యాయం, మోసం, వంచన, అబద్ధం, హింసాకాండ, దౌర్జన్యం, కల్లోలం, దైవచట్టాన్ని అతిక్రమించటం, దైవవిద్రోహులకు విధేయుడయి జీవించడంలాంటి పనులు నమాజ్ చేసే మనిషి చేయలేడు. నమాజ్ చేసే ఏ వ్యక్తి జీవితమైనా ఈ దుర్గుణాల నుండి సురక్షితంగా లేకపోతే, అతడు చేసే నమాజ్ కేవలం ఒక ఆచారం మాత్రమే. అది నిజమైన నమాజ్ కానేరదు. అర్థం చేసుకోకుండా ఏదో చేయాలని చేసే నమాజ్ సాంప్రదాయకమైనదే. దీనివల్ల ఒక ముస్లిమ్‌కు కలుగవలసిన లాభం కలుగదు.

★★

# 3

ఇప్పుడు మీరు నమాజ్ అర్థాన్ని వివరంగా తెలుసుకోండి. దీన్ని బాగా జ్ఞాపకముంచుకోవడం చాలా అవసరం. ఒక్కొక్క మాటలో ఇమిడి ఉన్న అర్థం విపులంగా విడదీసి చెప్పబడింది. ఇవన్నీ మీకు క్షుణ్ణంగా అర్థమైతే మళ్ళీ మరచిపోతారనే భయముండదు. ఈవిధంగా అర్థంచేసుకుని నమాజ్ చేస్తే, సంతృప్తి, శాంతి, మధురమైన అనుభూతి లభిస్తాయి. నమాజ్ అర్థాన్ని మీరు కేవలం కంఠస్థం చేసినట్లయితే, దానివల్ల ప్రయోజనం ఉండకపోవడమే కాకుండా, అది అర్థంచేసుకోకుండా చేసినట్లే అవుతుంది. అంటే అరబ్బీ భాషలోనే చేసినట్లని అర్థం.

## అజాన్ (నమాజ్ పిలుపు)

మొదట అజాన్, దాని అర్థాన్ని తీసుకుందాం.

అక్బర్ = అందరికంటే గొప్పవాడు.

అష్హదు = ప్రమాణంచేసి చెబుతున్నాను (సాక్ష్యమిస్తున్నాను).

అన్ = ఏమిటంటే

లా = లేదు

ఇలాహ = పూజకు, ఆరాధనకు అర్హుడు

ఇల్లా = తప్ప, మినహా

అన్న = నిస్సందేహంగా

రసూల్ = ప్రవక్త

హయ్యా = రండి

అలా = వైపు, దిశ

సలాత్ = నమాజ్ (దైవప్రార్థన)

ఫలాహ్ = విజయం, సత్ఫలితం

ఖైర్ = మంచి

నౌమ్ = నిద్ర

ఖామత్ = సిద్ధముగా నున్నది

ముఅజ్జిన్ (నమాజ్‌కు రమ్మని పిలిచేవ్యక్తి) మొదట నాలుగుసార్లు అంటారు...

అల్లాహు అక్బర్ = అల్లాహ్ అందరికంటే గొప్పవాడు.

అల్లాహు అక్బర్ = అల్లాహ్ అందరికంటే గొప్పవాడు.

అష్హదు అఁల్లాయిలాహ ఇల్లల్లాహ్ = అల్లాహ్ తప్ప ఆరాధనకు అర్హులైన వారెవరూ లేరని నేను ప్రమాణం చేసి చెబుతున్నాను (సాక్ష్యమిస్తున్నాను).

అష్హదు అన్న ముహమ్మదుర్రసూలుల్లాహ్ = ముహమ్మద్ దేవుడు పంపిన ప్రవక్త అని నేను ప్రమాణంచేసి చెబుతున్నాను (సాక్ష్యమిస్తున్నాను).

హయ్యా అలస్సలాహ్ = నమాజ్‌కు రండి.

హయ్యా అలల్ఫలాహ్ = సత్ఫలితం (జయం) పొందటానికి రండి.

అల్లాహు అక్బర్ = అల్లాహ్ అందరికంటే గొప్పవాడు. ఆ తరువాత... లా ఇలాహ ఇల్లల్లాహ్ అని ఒక్కసారి మాత్రం అంటాడు.

అస్సలాతు ఖైరుమ్ మినన్నౌమ్ = నమాజ్ నిద్రకంటే ఉత్తమమైనది.

(ఇది ఉదయం అజాన్‌లో మాత్రమే. హయ్యా అలల్ ఫలాహ్‌కు తరువాత అనబడుతుంది).

ఖద్ ఖామతిస్సలాహ్ = నమాజ్ సిద్ధంగా ఉన్నది నమాజ్ కొరకు అందరు నిలబడినారు అని అర్థం.

(దీన్ని తక్బీర్‌లో మాత్రమే హయ్యా అలల్ ఫలాహ్‌కు తరువాత అనాలి).

చూడండి ఎంత మహోజ్వలమైన పిలుపో ఇది. మేము దైవ సమానులమని చెప్పుకునే పెద్దమనుషుల మాటల్లో ఎంత బూటకముందో, ఎంత అసత్యముందో ఈ మధురమైన పిలుపు మనకు మళ్ళీ మళ్ళీ జ్ఞాపకం చేస్తుంది. భూమ్యాకాశాల్లో పెద్దరికానికి, ఆధిక్యతకు అర్హతగల శక్తి ఏదన్నా ఉంటే, అది కేవలం దేవుని శక్తి మాత్రమే. దేవుడు మాత్రమే దాస్యానికి, భక్తికి, పూజకు, ఆరాధనకు అర్హుడు. ఆయన్ని కాకుండా, ఇతరుల్ని పూజించడం, వారికి విధేయత చూపడం అసమంజసం, సత్యవిదూరం. "రండి ఆయన్నే సేవించండి, ఆయన సేవలో ఇహపరలోకాల విజయం ఉంది" అనే ఈ మహత్తరమైన పిలుపు విని చలించని మనిషి ఉంటాడా? విశ్వాసానికి అత్యుత్తమ సాక్ష్యమైన దీన్ని విని కదలిపోకుండా ఉండటం ఎలా సాధ్యం? కొద్దిపాటి విశ్వాసం ఉన్న ఏ మనిషైనా ఈ పిలుపును వినగానే లేచి నిలుచుంటాడు. తన ఏకైక ప్రభువు ముందు సాష్టాంగపడటానికి పరుగెత్తుకుంటూ వస్తాడు. అందరికంటే గొప్పవాడు, నిజమైన ప్రభువు అయిన దైవసాన్నిధ్యానికి రమ్మని పిలిచే ఈ పిలుపునువిని, తన ప్రభువును గుర్తించనివాడే చలనం లేకుండా కూర్చోగలుగుతాడు. లేక అతడు తన ప్రభువును ఎరిగి కూడ, ఆయన ఆజ్ఞలంటే లెక్కచేయని సిగ్గుమాలిన వాడైనా అయిఉండాలి.

నమాజ్ పిలుపు వినగానే, దైవభక్తులు, చేసే పనులన్నీ విడిచి నిలుచుంటారు. వుజూ చేసుకొని, పరిశుభ్రమై మస్జిద్‌కు వస్తారు. నమాజ్ చేయటానికి నిలుచున్నారంటే, భూమ్యాకాశాలను సృష్టించి, జగత్తును పరిరక్షించి, పోషించే ఏకైక ప్రభువుముందు నిలుచున్నామనే భావం మీ

మస్తిష్కంలో నిత్యనూతనమవుతుంది. అప్పుడు మీరు ఏకాగ్రచిత్తులై ఈ విధంగా పఠిస్తారు.

ఇన్నీ వజ్జహ్తు వజ్హియ లిల్లజీ ఫతరస్సమావాతి వల్ అర్జహనీఫాం, వమా అనామినల్ ముష్రికీన్, ఇన్నస్సలాతి వ నుసుకి వ మహ్యాయ వ మమాతి లిల్లాహి రబ్బిల్ ఆలమీన్ లాషరీక లహు వ బిజాలిక ఉమిర్తు వ అన మినల్ ముస్లిమీన్.

అన్నిటినుండి వేరై (తెగి), ఒకే ధ్యానంతో, ఆకాశాలను, భూమిని సృజించిన ఆ అల్లాహ వైపునకు నేను మరలాను. నేను దైవేతరుల్ని దైవసమానులుగా ఎంచేవాణ్ణికాను. సర్వలోకాలకు ప్రభువు, పరిపోషకుడు అయిన అల్లాహకే నా నమాజ్, నా త్యాగం, నా జీవితం, నా మరణం అర్పితం. ఆయన దైవత్వంలో ఎవ్వరికీ భాగంలేదు. నాకు ఆదేశింపబడినది ఇదే. నేను జీవిత పర్యంతం ఆయనకే విధేయుణ్ణి.

ఇదే నమాజ్ సారం. వాస్తవానికి ఇది ఒక ముస్లిమ్ జీవితానికే సారం !

మానవుడు అన్నిటినుండి వేరై, నిర్మల హృదయంతో తన్ను సర్వేశ్వరుని వైపునకు త్రిప్పుకోవడమే నిజమైన ఇస్లామీయ జీవితం. అంటే, అచంచలమైన మనస్సుతో దైవవిధేయుడై జీవించడం. ఇంకా, స్థిరచిత్తుడై మనిషి జీవితాన్ని దైవేచ్ఛానుసారంగా గడపాలని నిర్ణయించుకోవడం. ప్రాపంచిక పనుల్ని విడిచి పూజా పునస్కారాల్లో ప్రతినిత్యం నిమగ్నం కావాలని ఏ మాత్రం దీని అర్థం కాదు. దీని అర్థమేమంటే ప్రపంచానికి సంబంధించిన ప్రతి పని ఎడల అల్లాహ అభీష్టమేదో తెలుసుకోవాలి, జ్ఞాపకముంచుకోవాలి. ఈ భావం, ఈ ఆలోచన తాను వేసే ప్రతి అడుగు, చేసే ప్రతి పనిలో ప్రస్ఫుటం కావాలి. వ్యాపార విషయాలు, పరస్పర సంబంధాలు, రాజకీయాలు,పరిపాలనా

కార్యక్రమాలు - ఏవన్నా కానివ్వండి, అవి అల్లాహ్ ఆజ్ఞలకు అనుగుణంగా ఉండాలి. మానవుని జీవితం, ఆయన ప్రసాదించిన ధర్మంకోసం, అతని మరణం దైవం కోసం, దైవ సంతోషం కోసం సమర్పితం కావాలి. దైవం వైపు లగ్నం కావటంలో ఉన్న అంతరార్థమిదే. ఒకవేళ మన జీవితం ఈ విధంగా ఉండకపోతే అది నిజమైన ఇస్లామీయ జీవితంకాదు.

కేవలం నమాజ్‌లోనే కాక, జీవితానికి సంబంధించిన ప్రతి విషయంలోను ముస్లిమ్, దైవదాసుడనే భావం ప్రతి నమాజ్‌కు ముందు జ్ఞాపకం చేయబడుతుంది. దీని తరువాత మీరు మీ రెండు చేతుల్ని చెవులదాకా ఎత్తుతారు. అంటే, ప్రపంచం, దానికి సంబంధించిన పనులతో ప్రస్తుతం మీకు ఎలాంటి సంబంధం లేదు అని ప్రకటిస్తున్నారన్నమాట. "అల్లాహు అక్బర్" అని రెండు చేతుల్ని కట్టుకుంటారు. అప్పుడు ప్రభువు సాన్నిధ్యంలో నిశ్చలమనస్కులై మీరు అంటారు...

## సనా (దైవ స్తోత్రం)

సుబ్‌హాన = పవిత్రుడవు, లోపములేని వాడవు

క = నీవు, నీది

అల్లాహుమ్మ = ఓ స్వామీ, ఓ దేవా !

వ = మరియు

బి = తో, తోడ

హమ్ద్ = స్తుతి, స్తోత్రము, కృతజ్ఞత

తబారక = శుభకరము

ఇస్మ్ = పేరు, నామము

త ఆలా = మహోన్నతమైనది

జద్ద్ = ఘనత, మహత్తు

గైర్ = తప్ప

సుబ్‌హానకల్లాహుమ్మ వబిహమ్‌దిక వతబారకస్ముక వత ఆలా జద్దుక వలా ఇలాహ గైరుక.

ఓ అల్లాహ్ ! నీవు అత్యంత పవిత్రుడవు, సమస్త స్తోత్రాలు కృతజ్ఞతలు కేవలం నీకే. నీ పేరు ఎంతో శుభప్రదమైనది. నీ ఘనత మహోన్నతమైనది. నీవు తప్ప ఆరాధనకు అర్హుడయిన వాడెవ్వడూ లేడు.

దైవస్తోత్రంతో మీరు నమాజ్‌ను ప్రారంభించారు. విధేయతకు, దాస్యానికి అల్లాహ్ తప్ప ఇతరులెవ్వరూ అర్హులు కారనే మీ విశ్వాసం మీ హృదయంలో నూతనమైనది. దీని తరువాత...

అఊజు = నేను శరణు వేడుకుంటున్నాను

మిన్ = నుండి

రజీమ్ = తరిమివేయబడిన, ఛీత్కరించబడిన, త్రోసివేయబడిన, ధూత్కరింపబడిన

బిస్మి = పేరుతో

రహ్మాన్ = కరుణామయుడు

రహీమ్ = ప్రేమించువాడు, వరము లిచ్చువాడు

అవుజు బిల్లాహి మినష్షయ్‌తా నిర్రజీమ్ బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్.

షైతాన్ జాలాన్నుండి సంరక్షింపబడటానికి, నేను దైవాన్ని శరణు వేడుకుంటున్నాను. కరుణామయుడు, ప్రేమించువాడు అయిన అల్లాహ పవిత్ర నామస్మరణతో ప్రారంభిస్తున్నాను.

మీరు నమాజ్‌లో అల్లాహ్‌తో నివేదించుకునే ముందు మీ ఏకాగ్రతను భగ్నం చేయటానికి మీ మనస్సులో అనేక మలిన భావాలను ఉత్పన్నం చేయటానికి ప్రయత్నించే షైతాన్ జాలాన్నుండి రక్షణకొరకు దైవాన్ని శరణు వేడుతారు. షైతాన్ పన్నిన వల నుండి రక్షింపబడటానికి మీరు స్వయంగాను పైశాచిక విషయాలకు దూరంగా ఉండాలి. అప్పుడే మీకు దైవ సహాయం లభిస్తుంది. మీరు అనే ప్రతిమాటను ఆలోచించి, అర్థం చేసుకుని మరీ అనండి. దుర్మార్గానికి లోనుగాకుండా మీరు చేయగలిగినంత ప్రయత్నం మనఃపూర్వకంగా చేయండి. అప్పుడు అల్లాహ సహాయాన్ని అర్థించండి. తప్పకుండా కరుణామయుడైన దేవుడు మీకు సహాయం చేస్తాడు. కష్టాలు తీరుతాయి. మీ మార్గం సాఫీగా ఉంటుంది. దేవుడు మీకు ఇచ్చిన ఈ శక్తిని, అధికారాన్ని ఉపయోగించుకోకుండా, ఊరికే చేతులు కట్టుకుని కూర్చుని, కేవలం ప్రార్థిస్తూ ఉంటే, ఆ ప్రార్థనలు అంత ఎక్కువగా మన్నింపబడవు. అందుకని నమాజ్‌లోనే కాదు, మీ జీవితంలో కూడ షైతాన్ దుష్ట ప్రభావాన్నుండి మిమ్మల్ని రక్షించుకోటానికి దేవుడిచ్చిన శక్తి సామర్థ్యాలను ఉపయోగించాలి. ఈ పనిచేస్తూనే దైవసహాయాన్ని అర్థించాలి. అప్పుడు మీకు దైవ సహాయం తప్పకుండా లభిస్తుంది. తద్వారా సన్మార్గంపై స్థిరంగా ఉండటం, దుర్మార్గానికి దూరంగా ఉండటం కూడా మీకు సులభ సాధ్యమవుతుంది.

ఇప్పుడు మీరు అల్లాహ పేరుతో ఈ విధంగా ప్రారంభిస్తారుః

# అల్ ఫాతిహా

లిల్లాహ = అల్లాహ్‌కే
రబ్ = యజమాని, ప్రభువు, పరిపోషకుడు
ఆలమీన్ = సమస్త లోకములకు
మాలిక్ = యజమాని (న్యాయాధిపతి)
యౌమ్ = దినము, రోజు
దీన్ = ప్రతిఫలం
ఇయ్యాక = నిన్నే, నీ నుండే, నీ కొరకే
నఅబుదు = మేము ఆరాధిస్తున్నాము
నస్తయీన్ = మేము సహాయం కోరుతున్నాము
ఇహ్‌ది = నీవు చూపించు
నా = మాకు
సిరాత్ = మార్గము, దారి
ముస్తఖీమ్ = సరియైనది, సరళమయినది
అల్లజీన = ఎవరయితే
అన్ అమ్‌త = నీవు అనుగ్రహించిన
అలైహిమ్ = వారిపై
మగజూబ్ = దైవాగ్రహానికి గురియైనవారు
జాల్లీన్ = దారి తప్పినవారు
ఆమీన్ = తథాస్తు ( కోరినట్లుగానే అగుగాక)

అల్‌హమ్దు లిల్లాహి రబ్బిల్ ఆలమీన్, అర్రహ్మా నిర్రహీం, మాలికి యౌ మిద్దీన్ ఇయ్యాక న అబుదు వ ఇయ్యాక నస్తయీన్. ఇహ్‌ది నస్సిరాతల్

ముస్తఖీమ్ సిరాతల్లజీన అన్అమ్‌త అలైహిమ్ గైరిల్ మగ్‌జూబి అలైహిమ్ వలజ్జాల్లీన్.

సమస్త లోకాలను పోషించే అల్లాహ్‌కే సర్వస్తోత్రములు. ఆయన మిక్కిలి కరుణామయుడు, ప్రేమించువాడు, తీర్పుదినపు యజమాని. (లోకేశ్వరా!) నిన్నే మేము ఆరాధిస్తున్నాము. సహాయము చేయమని నిన్నే అర్థిస్తున్నాము. మోక్షము లభించు సరియైన మార్గాన్ని మాకు చూపించు. నీ అనుగ్రహానికి పాత్రులయిన వారి మార్గాన్ని, నీ ఆగ్రహానికి గురికాని వారి, దారి తప్పనివారి మార్గాన్ని మాకు చూపించు.

"కృతజ్ఞతతో చేసే స్తుతులన్నీ అల్లాహ్‌కే" అని మీరు అనటానికి కారణమేమిటి? ఆయనే మిమ్మల్ని పుట్టించాడు; ప్రాణం పోశాడు; జీవించటానికి కావలసిన సామాగ్రినంతా ఇచ్చాడు; భూమ్యాకాశాల్లో ఉన్నదంతా మీకు సేవచేయడానికి సృష్టించాడు; ఇందుకేగా మనమంతా ఆయన్ని అంతగా స్తుతించేది. ఆయన అందరినీ మించిన మహోపకారి, వాస్తవంగా అసలు ఆయనే మన నిజోపకారి. ఇతరులెవరన్నా మనకు ఉపకారం చేస్తున్నారంటే అసలు వాళ్ళ దగ్గర ఏముంది? దైవం ప్రసాదించిన కానుకల్ని వారు ఇతరులకు ఇస్తున్నారన్నమాట. వారికి ఆ విధంగా చేసే భాగ్యాన్ని కలిగించేది దేవుడే. దేవుడు ఎవరికన్నా, ఏదన్నా ఇస్తున్నాడంటే తన వద్దనుండి తనదైనదాన్ని ఇస్తున్నాడు. ప్రతిఫలాపేక్ష లేకుండా ఇస్తున్నాడు. మానవులకు, సకల చరాచరాలకు ఇస్తున్నాడు. ఈ ప్రపంచంలో ఎవరన్నా దేనినన్నా పొందుతున్నారంటే, అది పరోక్షంగానో ప్రత్యక్షంగానో కేవలం దైవం వల్లనే. మేలుచేస్తే కృతజ్ఞత తెలుపడం మన కర్తవ్యం. కృతఘ్నత నీచుల లక్షణం. మన శరీరంలో ఉన్న ప్రతి అణువులో దైవం చేసిన మేలు కన్పిస్తుంది. దానికి మనం కృతజ్ఞత తెలుపకపోతే, అది విశ్వాస ఘాతుకం

అవుతుంది. దైవానికి కృతజ్ఞత తెలుపడమంటే, ఆయనకు మీరు ఏదో మహోపకారం చేయాలని కాదు. ఆయన మనకిచ్చిన ప్రతి వస్తువును, చేసిన ప్రతి మేలును నిండు మనస్సుతో గౌరవించాలి. అందరికంటే, అన్నిటికంటే ఆయన్నే ఎక్కువగా ప్రేమించాలి. ఆయన చేసిన మేళ్ళను ఒప్పుకోవాలి. ఆయన మనకిచ్చిన ఈ జీవితాన్ని, జీవితంలోని సౌలభ్యాలను ఆయన అభీష్టం ప్రకారం ఉపయోగించాలి. కేవలం నోటితో వెళ్ళబుచ్చే కృతజ్ఞత, కృతజ్ఞత అనిపించుకోదు.

"ఆయన సర్వలోకాలకు యజమాని, పోషకుడు" అని మీరు అంటారు. ఈ మాటలు ఎంతో గొప్పవి. వాటిని పలికి మీరు ఒక పెద్ద ప్రమాణం చేశారన్నమాట. ఈ విశ్వాసం మీ హృదయపులోతుల్లో నాటుకుపోతే మీ జీవితగతే మారిపోతుంది. అప్పుడు మీరు ఈ యావత్ప్రపంచాన్ని ఒకే దేవుని బానిసగా చూస్తారు. మీకు ఏ వస్తువూ అనవసరమైనదిగా, వింతగా, పరాయిదిగా కన్పించదు. ఎవరయితే ఆ ప్రభువు అభీష్టానికి, ఆజ్ఞలకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తూ కన్పిస్తారో, వారిని తమ కర్తవ్యాన్ని గుర్తించేటట్లుగా చేస్తారు. వారి బుద్ధిలేమికి జాలిపడి, ఎంతో ఓర్పుతో వారికి జ్ఞానబోధ చేసి, వారు తమ నిజప్రభువును గుర్తించేలా మీరు ప్రయత్నం చేస్తారు. ఈ మనిషి సన్మార్గం వైపునకు రాడు. ఇంకా అతనికోసం కష్టపడటం నిష్ప్రయోజనం అనే నమ్మకం మీకు కలుగనంత వరకు మీరు మీ ప్రయత్నాలను మానరు.

ఈ ప్రమాణానికి పర్యవసానంగా మీరు అల్లోహయే మా ప్రభువనీ, అందరికీ ఆయనే ఆధారమనీ, అందరం ఆయన ఇచ్చిన ఆహారాన్నే తింటున్నామనీ, అందర్నీ ఆయనే పోషిస్తున్నాడు అనీ ఒప్పుకుంటే మీరు అల్లోహను వదలి, ఇతరులపై ఆశలు ఎలా పెట్టుకుంటారు? ఆయన్ని కాదని ఇతరుల్ని దేవుళ్ళుగా ఎలా ఆరాధిస్తారు? ఏ విధమైన హక్కు, అధికారం

లేకుండా, మానవులు దేవుళ్ళయి కూర్చున్న బూటకపు దేవుళ్ళకు విధేయులై సేవకులై ఎలా జీవిస్తారు? వాస్తవానికి సర్వేశ్వరుడు అల్లాహ్ ఒక్కడే నిజమయిన స్వామి. ఆయన దైవత్వం ఆయన స్వశక్తి ఆధారంగానే ఉంది. ఆయనకు ఇతరుల సహాయ సహకారాల అవసరం లేదు. ఆయన తప్ప, ఇతరులందరికీ ఏదో ఒక ఆధారం కావాలి. సృష్టిలో కన్పించే ఏ వస్తువు ఏ ప్రాణి దైవం కాదు, కాజాలదు.

మీరు అల్లాహ్‌ను "కరుణామయుడు, ప్రేమించేవాడు" అన్నారు. వాస్తవానికి, ఆయన కంటే ఎక్కువగా కనికరించేవారు, కరుణించేవారు, ప్రేమించేవారు ఎవరూ లేరు. మహోజ్జ్వలము, మహాద్భుతము అయిన ఈ సృష్టిలో కన్పించే అసంఖ్యాక ప్రాణుల జీవనోపాధికి కావలసిన అన్ని అవసరాలను ఏర్పాటు చేసిన అల్లాహ్ ఎంత కరుణామయుడు ! ఆయన చేసిన మేళ్ళు అనంతమైనవి. వాటిని లెక్కించడం మానవ మాత్రునికి సాధ్యం కాదు, ఆయన చేసిన ఒక్క మేలు, ఒక్క అనుగ్రహానికి బదులుకూడా చెల్లించుకోలేడు. ఒకటి మాత్రం సాధ్యమే. దైవప్రసాదితమైన ఈ వరాలన్నిటినీ, ఆయన ఇచ్ఛానుసారంగా వాడగలడు. ఆయనకు అయిష్టంగా ఉండే విధంగా ఉపయోగించకుండా ఉండగలడు. అల్లాహ్ చేసిన ఈ మహోపకారాలకు ఈ మాత్రం కృతజ్ఞత తెలుపకూడదా?

"తీర్పు దినపు యజమాని" అంటారు మీరు. ఈ మాటలో ఉన్న అర్థాన్ని గమనించండి, "ఏదో ఒక రోజున అందరూ ఈ ప్రపంచాన్ని విడిచిపోవలసిన వారే. మరణానంతరం ఒకరోజున అందరూ మళ్ళీ బ్రతికింపబడతారు. ఆ రోజున మానవుడు ప్రపంచంలో చేసిన మంచి, చెడు పనులను గురించి జవాబు చెప్పుకోవాలి. మంచి పనులు చేసిన వారికి మంచి ప్రతిఫలం లభిస్తుంది. చెడుపనులు చేసినవారు, దైవానికి అవిధేయులై

జీవించినవారు కష్టాలపాలవుతారు. ఇంకా, ఆ రోజున రక్షించే, క్షమించే, శిక్షించే అధికారం ఆ స్వామికి తప్ప మరెవరికీ ఉండదు." ఈ మీ నమ్మకం ఆ మాటలతో పునశ్చరణ చేసి కొన్నట్లవుతుంది. ఈ భావం మీకు రోజు పలుమార్లు కలిగినప్పుడు, దాన్ని మీరు ధృవపరుస్తూ ఉన్నప్పుడు, మీరు, తెలిసీ కావాలని, చేయాలని దైవాజ్ఞల్ని ఉల్లంఘించటం సాధ్యమా? ఫలానా పనుల్ని చేస్తే దేవుడు శిక్షిస్తాడు అనే భయం, భావం మీలో కలిగినప్పుడు, వాటిని ఏ సందర్భంలోనూ మీరు చేయరు. ఎందుకంటే ఆయన శిక్ష చాలా తీవ్రంగా ఉంటుంది. దాన్నుండి రక్షించేవారు ఎవరూ ఉండరు. అప్పుడు మీరు దైవసంతోషానికి దోహదమిచ్చే పనుల్నే చేస్తారు. దానికి దైవం మీకిచ్చే బహుమానం చాలా గొప్పది.

మళ్ళీ మీరు చేసే ఇంకో ప్రమాణం చూడండి. "లోకేశ్వరా ! నిన్నే మేము ఆరాధిస్తున్నాము. సహాయం చేయమని నిన్నే అర్థిస్తున్నాము." దీన్ని మీరు అర్థం చేసుకుని, అచంచల విశ్వాసంతో, హృదయపూర్వకంగా అంటే మీ యావజ్జీవితం ఈ విషయానికే సాక్ష్యమిస్తుంది. అంటే మీ జీవితమనే అద్దంలో ఈ మీ విశ్వాసం స్పష్టంగా కన్పిస్తుంది. మస్జిద్ ప్రాంగణాన్ని విడిచిన తరువాత కూడ, ఇతరుల దాసులు అవటానికి ఇష్టపడరు. ఇతరులు కోరిన ప్రకారం మీ మనస్సు ఎలా చెబితే అలా కళ్ళు మూసుకొని చేయడానికి సుతరాము ఇష్టపడరు. అంటే కోరికలకు దాసులు కారు. ప్రతి పనిని చేసేముందు, దాని విషయంలో అల్లాహ్ అభీష్టం, ఆదేశం ఏమిటో అని తెలుసుకుంటారు. ప్రపంచంలోని ఏ శక్తి, ఏ ప్రభుత్వం, ఏ నాయకుడు, ఏ మతాచార్యుడు, దైవ వ్యతిరేకమైన ఏ పనినీ మీచేత చేయించలేరు, అనుక్షణం సన్మార్గంపై స్థిరంగా, అచంచలంగా ఉంటారు. దైవ విధేయులై దైవదాసులై జీవించేటప్పుడు వచ్చే కష్టాలను, నష్టాలను ధైర్యస్థయిర్యాలతో ఎదుర్కొనే

శక్తిని ప్రసాదించమని ఆపద్బాంధవుడయిన అల్లాహ్‌ను ప్రార్థిస్తారు.

"సరియైన మార్గాన్ని చూపమ"ని మీరు ఆయనతో వేడుకుంటారు. సన్మార్గులు, సద్గుణ సంపన్నులు కావాలనీ, దైవమార్గంపై స్థిరంగా నడవాలని మీకు దృఢ సంకల్పం లేకపోతే దేవుని దర్బారులో మీరు చేసే ఈ దరఖాస్తు అర్థరహితము, నిరుపయోగము కాగలదు. ఉదాహరణకు రోగంతో బాధపడే ఒక మనిషిని తీసుకోండి. డాక్టర్ దగ్గరకు పోయి తన వ్యాధిని నయం చేయమని, హృదయం కదిలేలా విలపిస్తూ ప్రార్థిస్తాడు. కాని తర్వాత, డాక్టర్ ఇచ్చిన మందు తినకుండా చెప్పిన పత్యం చేయకుండా, తినరాని పదార్థాలన్నీ తింటాడు. అతని ఈ అజాగ్రత్త వల్ల, రోగం నెమ్మదించక పోవడమే కాకుండా, విజృంభించి తీవ్రప్రమాదానికి దారితీస్తుంది.

దీని తరువాత మీరు "దైవమా ! నీవు అనుగ్రహించిన వారి, నీ ఆగ్రహానికి గురికానివారి, దారి తప్పనివారి మార్గాన్ని మాకు చూపు" అని ప్రార్థిస్తారు. ఇదంతా అన్న తరువాత దైవద్రోహుల, దైవమార్గం తప్పినవారి ఉద్యమాలను, విధానాలను అంగీకరించి, స్వీకరించటానికి మీకు ఏమాత్రం ఆస్కారం ఉండదు. అల్లాహ్ అనుగ్రహానికి పాత్రులయినవారి, ఇహపర లోకాల్లో కృతార్థులయిన వారి మార్గంపై నడిపించమని దైవాన్ని మీరు అర్థించారు. కాని అసలైన, అచ్చమైన ఇస్లామ్‌ను వదలి కమ్యూనిజం, జాతీయతత్వం, స్వదేశాభిమానం అనే పేలికల్ని ఇస్లామ్‌కు జోడిస్తే, మీరు చేసే నమాజ్‌లు, ఆరాధనలు మీకు ప్రయోజనాన్ని కలిగిస్తాయని ఏమాత్రం ఆశించవద్దు. మానవ జీవితం సుఖశాంతులతో అలరారటానికి, ఒక శాశ్వత విధానాన్ని ఆచరణ యోగ్యమయిన ఒక నియమావళిని ఇస్లామ్ ఇస్తుంది. దీన్ని సంపూర్ణంగా స్వీకరించినవారికి, ఇహలోకంలో విజయం, పరలోకంలో

మోక్షం లభిస్తాయి. ఇలాంటి వ్యక్తుల్నే అల్లాహ్ అనుగ్రహిస్తాడు. తమ పూర్తి జీవితాన్ని ఇస్లామీయ ధర్మానికి అంకితం చేయటానికి ఎవరయితే ఇష్టపడతారో, ఇస్లామ్‌తో ఇతర విధానాలను, సిద్ధాంతాలను జోడించి, దాన్ని కలగాపులగంగా తయారుచేసి తదనుగుణంగా తమ జీవితాన్ని ఎవరయితే గడుప నిశ్చయించు కుంటారో, వారు ఏరికోరి దైవాగ్రహాన్ని ఆహ్వానిస్తున్నారన్నమాట. లేక వారు అసలు మార్గాన్ని తప్పినవారైనా అయి ఉండాలి. ఇలాంటివారు పై విధంగా అల్లాహ్‌ను అర్థించడం ఆయనతో ఎగతాళి చేయటం కాక మరేమవుతుంది?

ఈ పరిస్థితికి లోనవకుండా మనల్ని కాపాడి, తన శరణులో చోటివ్వ మని మనం దేవుణ్ణి ప్రార్థించాలి. ఇహపర లోకాల్లో సఫలతను ప్రసాదించమని మీరు చేసే ప్రార్థన అయిపోయింది. తరువాత మీరు మీ ప్రభువుతో ఆఖర్లో ఒకమాట అంటారు - "ఆమీన్" అని. దీని అర్థమేమిటంటే, "ఓ ప్రభూ ! మేము కోరిన విధంగానే చెయ్యి. మా ప్రార్థనల్ని అంగీకరించు" అని. దీని తరువాత మీరు ఖుర్‌ఆన్‌లోని ఏదోఒక భాగాన్ని పఠిస్తారు. మానవ జీవితాన్ని తీర్చిదిద్దటానికి పంపబడ్డ చివరి దైవగ్రంథం ఖుర్‌ఆన్. దీని ప్రతి భాగంలో ఒక మహత్తర ప్రబోధం, ఒక అద్భుత గుణపాఠం మనకు దొరుకుతాయి. మీరు ఇప్పుడిప్పుడే దైవాన్ని కోరిన ఆ "సరళమార్గం" దీనిలోనే ఉంది.

ఖుర్‌ఆన్‌లోని ఏ భాగాన్ని చదివినా, దాన్ని అర్థం చేసుకునే యోగ్యత మనలో ఉండటం చాలా మంచిది. అది లేకపోతే చిన్న చిన్న సూరాల అర్థమయినా జ్ఞాపకముంచుకొనడానికి ప్రయత్నించాలి, ఇంకా ఖుర్‌ఆన్‌లోని కొన్ని భాగాలను క్షుణ్ణంగా అర్థం చేసుకునే కృషి నిరంతరం జరుగుతూ ఉండాలి. ప్రస్తుతానికి మీరు రెండు చిన్న సూరాల అర్థాన్ని తెలుసుకోండి.

# 'ఇఖ్లాస్' సూరా

ఖుల్ = (ఓ ప్రవక్తా !) అను, చెప్పు

హువ = అతడు, ఆయన

అహద్ = ఒకడు (ఆయనలాంటి వారు ఎవరూలేరు)

సమద్ = ఇతరులపై ఆధారపడనివాడు, అందరికీ ఆయన ఆధారం

లం = లేదు, కాదు

యలిద్ = ఆయన కన్నాడు (సంతానాన్ని)

యూలద్ = ఆయన పుట్టాడు

యకున్ = ఉన్నాడు, ఉన్నది

ల్లహు = ఆయన కోసం

కుఫువన్ = ఆయనతో సమానమైనవాడు

అహద్ = ఎవరయినా

ఖుల్ హు వల్లాహు అహద్. అల్లాహుస్సమద్. లమ్ యలిద్ వలమ్ యూలద్. వలమ్ యకుల్లహు కుఫువన్ అహద్.

ఓ ప్రవక్తా ! అల్లాహ్ ఒక్కడే; ఆయన లాంటి వాడు ఎవ్వడూ లేడు. అల్లాహ్‌కు ఎవ్వరి ఆధారం అవసరం లేదు. అందరికీ ఆయనే ఆధారం. ఆయన ఎవరినీ కనలేదు. (అంటే ఆయనకు సంతానమే లేదు) ఆయన్ని ఎవరూ కనలేదు. (అంటే ఆయనకు తల్లీ, తండ్రీ లేరు) ఆయనకు సమానుడు ఎవడూలేడు.

# 'అస్ర్' సూరా

వ = ప్రమాణము (సాక్షిగా)

అస్రి = కాలము

ఇన్న = నిస్సందేహంగా

ల = తప్పకుండా, నమ్మకంగా

ఫీ = లో, లోపల

ఖుస్రిన్ = నష్టము

అల్లజీన = వారు, ఆ మనుషులు

ఆమనూ = విశ్వసించినవారు

అమిలు = (పని) చేసినవారు

సాలిహాత్ = మంచిపనులు, సత్కార్యములు

తవాసౌ = ఉపదేశించారు, ప్రబోధించారు

హఖ్ఖ్ = సత్యము, యధార్థము, నిజము

సబ్ర్ = కష్టాలను సహించడం, సన్మార్గంపై స్థిరంగా ఉండటం, ఓరిమి, సహనం, స్థయిర్యం.

వల్ అస్రి ఇన్నల్ ఇన్సాన లఫీ ఖుస్రిన్ ఇల్లల్లజీన ఆమనూ వ అమిలుస్ సాలిహాతి వతవాసౌ బిల్ హఖ్ఖి వతవాసౌ బిస్సబ్ర్.

కాలము సాక్షిగా!★ నిస్సందేహంగా మానవుడు అపారనష్టంలో ఉన్నాడు. కాని విశ్వసించినవారు, సత్కార్యములు★★ (అల్లోహ చేయమన్న పనులు) చేసినవారు, ఒకరినొకరు ధర్మపథాన నవడటానికి, ఆ మార్గంలో ఎదురయ్యే కష్టనష్టాల్ని స్థయిర్యంతో సహించటానికి ప్రబోధం చేసుకునే వారు మాత్రమే ఆ నష్టాన్నుండి, ఆ దివాలానుండి సురక్షితంగా ఉన్నారు.

ఈ సూరాలో మనకు అత్యంత ప్రధానమైన ఉపదేశముంది. మానవుడు ఇహపర లోకాల్లో వినాశం, విచ్ఛిన్నంనుండి సురక్షితంగా ఉండాలంటే ఒకేఒక మార్గం ఉంది. అందుకు అతడు దైవాన్ని విశ్వసించాలి. సత్కార్యములు చేయాలి. కేవలం విశ్వసించడంతోనే సరిపోదు. లేదా మంచి పనులు చేయడం కూడా చాలదు, ఇతరుల్ని కూడా దైవమార్గం వైపునకు పిలవాలి. సన్మార్గంపై నడవటానికి దానిపై సుస్థిరంగా ఉండటానికి పరస్పరం సహాయ సహకారాలు అందజేసుకుంటూ ఉండాలి. ఇంకా ఈ సందర్భంలో వచ్చే కష్టాలను ఎంతో ఓర్పుతో భరించడమే కాక తమ మిత్రులతో కలసి ధర్మపథంపై స్థిరంగా ఉండటానికి తయారు కావాలి.

పై సూరాల నుండి ఏదో ఒక సూరాను చదివిన పిదప, మీరు "అల్లాహు అక్బర్" అని వినయంతో (రుకూ) మోకాళ్ళపై చేతులు పెట్టి వంగుతారు. అప్పుడు

---

★ దీని అర్థం ఏమంటే కాలం ఈ మాట నిజమని సాక్ష్యమిస్తోంది. మనకు పూర్వం మరణించిన వారి చరిత్ర మన కళ్ళముందు ఉన్నది. ముందు రాబోయే మాటలు ఎంత సత్యమైనవో, ఎంత యధార్థమైనవో, ఈ చరిత్రను చదివితే స్పష్టమవుతుంది.

★★ తోటి వారిని సన్మార్గం వైపునకు రమ్మని ఆహ్వానించేవారు దైవమార్గంపై స్థిరంగా ఉంటూ, వచ్చే కష్టాలను ఓర్పుతో సహించమని ప్రబోధం చేసేవారు.

"సుబ్‌హాన రబ్బియల్ అజీం" అంటారు, (మహాఘనతకల నా ప్రభువు, ఏ లోపము లేని పవిత్రుడు).

(రబ్బీ = నా ప్రభువు; అజీం = మహిమగలవాడు)

ఈ విధంగా అని నిటారుగా నిలుచుంటారు, నిలుచుంటూ ఇలా అంటారు -

"సమి అల్లాహులిమన్ హమిద" (కృతజ్ఞతలు తెలిపిన వాని మాటలను అల్లాహ ఆలకించాడు).

సమిఅ = విన్నాడు, ఆలకించాడు

లిమన్ = ఎవరయితే

హమిద = కృతజ్ఞతలు తెలిపాడు

పూర్తిగా నిలుచున్న పిదప మీరు,

"రబ్బనా లకల్ హంద్"

(ఓ మా ప్రభూ ! సమస్త స్తుతులు నీకే) అంటారు.

రబ్బనా = ఓ మా ప్రభూ !

లక = నీ కొరకు

మళ్ళీ "అల్లాహు అక్బర్" అంటూ మీరు మీ శరీరావయవాల్లో గౌరవప్రదమయిన భాగాన్ని అంటే మీ నుదిటిని దేవునిముందు భూమిపై అతి వినయంతో ఆనిస్తారు. సజ్‌దాలో నుదిటిని భూమికి తాకించి, అనేకసార్లు అంటారు....

"సుబ్‌హాన రబ్బియల్ ఆలా"

మహా మహోన్నతుడయిన నా ప్రభువు ఏ దోషము లేనివాడు. (అల్లాహ - మహోన్నత స్థానమున్నవాడు).

మీరు దేవుని దర్బారులో మీ శరీరాన్ని వినయంతో వంచి మళ్ళీ గౌరవంతో నిలుచుని, ఇంకా, మీ లలాటాన్ని భూమిపై పెట్టి మీరు చేసే ప్రమాణాన్ని గురించి ఆలోచించండి. అందరికంటే గొప్పవాడు, మహోన్నతుడైన వానిని మీరు మీ ప్రభువుగా స్వీకరించారు. మీరు ఎవరి దాసులో, వాని అంతస్తు, స్థానం ఉన్నతమైనది అనే విషయంపై మీకు పూర్తి నమ్మకం కలిగింది. దీని తరువాత కూడా ఒకవేళ (దైవం ఆ విధంగా చేయకుండుగాక) మీకు ఆపదలు కలిగితే, సహాయం చేయమని ఆయన్నిగాక ఇతరుల్ని ఎలా వేడుకుంటారు? మీలో నిరాశా నిస్పృహలు ఎలా తలెత్తుతాయి? ఇది అసంభవం, అసాధ్యం. మీ ప్రభువు, మీ యజమాని అందరికంటే చాలా గొప్పవాడు. మీరు ఏమి కోరినా మీకు ఏమి కావలసినా ఆయన్నే అర్థిస్తారు. ఆయన్ను వదలి ఇతరుల వద్దకు ఎలా పోతారు? రోజూ ఆయన పవిత్ర దర్బారులో ఎన్నోసార్లు హాజరవుతారు. ప్రతి నమాజ్‌లో అనేకమార్లు "కృతజ్ఞతలు తెలిపే వారి మాటలను అల్లాహ్ వింటాడు" అని అంటారు, మీ మనస్సులో ఉన్న కోరికలు, ఆశలు అన్నీ ఆయనకు తెలుసు, ఆయన్ని ఎల్లవేళలా ఏదికావాలన్నా అడుగవచ్చు, పొందవచ్చు, ఆయనకున్న అధికారం, మహిమ అనన్య సామాన్యమైనవి. అన్ని విషయాలను ఆయనతో అనకపోతే మరింకెవరితో అంటారు? ఈ విధంగా మీ ప్రభువు తన అనుగ్రహాల్ని మీపై వర్షింపచేస్తే, ఆయన కరుణవల్ల మీకు మానసిక శాంతి లభిస్తే మీరు గర్వపడి విర్రవీగుతారా? (దైవం ఆ విధంగా చేయకుండుగాక) కృతఘ్నులై ప్రవర్తిస్తారా? లేదు. ఆవిధంగా ఎప్పటికీ కాదు. ఎందుకంటే అందరికంటే గొప్పవాడు, అత్యున్నతస్థానం కలవాడు అల్లాహ్ ఒక్కడేనని మీకు తెలుసు. మీకు దొరికిన ప్రతివస్తువు ఆయన చలువ వల్లనే దొరికింది అనే జ్ఞానం మీకు ఉంది.

ఆలోచించి, అర్థం చేసుకోదగ్గ మాట మరొకటుంది, ఏ ప్రభువు

ముందయితే అత్యంత వినమ్రులై శరీరాన్ని వంచి, సాష్టాంగపడి భక్తినీ, విధేయతను తెలుపుకుంటారో, బయటకు రాగానే ఆయనకు ఎదురు తిరుగుతారా? ఇది ఎలా సాధ్యం? ఒకవేళ మీరు ఆ విధంగా ప్రవర్తించి, మళ్ళీ మీ ప్రభువు ముందు హాజరైనప్పుడు, ఆయన ఔన్నత్యాన్ని స్తుతించి, శిరస్సును భూమిపై పెట్టి, భక్తి ప్రపత్తులను వెల్లడిస్తే మీరు చేసే ఈ పూజకేమన్నా విలువ ఉంటుందా? ఆ నమాజ్, ఆ ప్రార్థన, ఆ ఆరాధన మీ ముఖంపై త్రిప్పికొట్టబడతాయి జాగ్రత్త !

నమాజ్‌లోని ఒక రకాత్★ పూర్తి అయింది. ఈ విధంగానే రెండో రకాత్★★ను కూడా పూర్తిచేయాలి. మొదటి రకాత్‌లో అన్న మాటలన్నింటినీ మళ్ళీ తిరిగి అనాలి.

ఇప్పుడు మీరు (రెండు రకాత్‌లు అయిన తరువాత) వినయంతో కూర్చుంటారు. కూర్చున్న పిదప ఈ విధంగా అంటారు.

## "తషహ్‌హుద్"

తహియ్యాత్ = నోటితో చేసే ఆరాధనలు
సలవాత్ = శరీర అవయవములతో చేసే ఆరాధనలు
తయ్యిబాత్ = ధనంతో చేసే ఆరాధనలు
సలాం = శాంతి
అలైక = నీపై

---

★ ప్రతి రకాత్‌లో రెండుసార్లు నుదిటిని భూమిపై పెట్టి సజ్దా చేయాలి. సజ్దా చేసేటప్పుడు, తలను లేపేటప్పుడు "అల్లాహు అక్బర్" అనాలి.

★★ రెండవ రకాత్‌లో "సనా" ను, "అఊజు బిల్లాహి మినష్షయ్ తానిర్రజీం"ను చదువకూడదు.

అయ్యుహ = ఓ !

నబీ = ప్రవక్త

రసూల్ = సందేశహరుడు

రహ్మత్ = కరుణ, దయ, కారుణ్యం

బరకాత్ = వరములు, మేళ్ళు

అలైనా = మా మీద

అలా = పై, మీద

అబ్ద్ = దాసుడు

ఇబాద్ = దాసులు

సాలిహీన్ = మంచివారు, సద్గుణ సంపన్నులు, సన్మార్గులు.

అత్తహియ్యాతు లిల్లాహి వస్సలవాతు వత్తయ్యి బాతు అస్సలాము అలైక అయ్యుహన్నబీయ్యు వరహ్మతుల్లాహి వబరకాతుహ్ అస్సలాము అలైనా వ ఆలా ఇబాదిల్లాహిస్సాలిహీన్. అష్హదు అల్లాయిలాహ ఇల్లల్లాహు వ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహ్.

వాక్కుతో చేసే ఆరాధనలు, కాయముతో (శరీరావయవములతో) చేసే ఆరాధనలు, ధనంతో చేసే ఆరాధనలు కేవలం అల్లాహ్‌కే. ఓ ప్రవక్తా ! నీపై శాంతి కలుగుగాక ! అల్లాహ్ నిన్ను కరుణించుగాక, నీపై అల్లాహ్ తన శుభాలను కుమ్మరించుగాక. మాపై ఇతర సన్మార్గులపై దేవుడు శాంతి కలిగించుగాక. ఆరాధనకు, దాస్యానికి, అర్హుడు కేవలం అల్లాహ్ మాత్రమేనని నేను ప్రమాణం చేసి చెబుతున్నాను. ముహమ్మద్ దైవదాసుడని ప్రవక్త అని కూడా నేను సాక్ష్యమిస్తున్నాను.

ప్రతి మానవుడు దైవానికి దాసుడు. ఈ దైవ దాస్యానికి అర్థం, మస్జిదులో వినయ విధేయతలతో, శ్రద్ధాభక్తులతో చేతులు కట్టుకుని

శరీరాన్ని వంచి సజ్దా చేసి బయటికి వచ్చిన తరువాత ఇష్టానుసారంగా స్వేచ్ఛగా ప్రవర్తించటం ఏమాత్రం కాదు. మీకున్న శక్తిసామర్థ్యాలు, ప్రజ్ఞాప్రాభవాలు, ధన సంపత్తి, ఒకటేమిటి మీ వద్దనున్న సమస్తమూ అల్లాహ్ అమానతు. ఈ సత్యాన్ని మళ్ళీ మళ్ళీ జ్ఞాపకం చేసుకోవడం ముస్లింలకు చాల అవసరం. ఈ భావం మానవుని మస్తిష్కంలో హమేషా తాజాగా ఉండకపోతే, అతడు తన మాటలను, తన శక్తి సామర్థ్యాలను, తన ధనాన్ని తన ఇష్టానుసారంగానో లేక తనలాంటి ఇతరులు కోరిన విధంగానో ఉపయోగించడం మొదలెడతాడు. అసలు ఇక్కడే కల్లోలానికి నాంది జరిగేది. మనిషి చేసే ఈ పొరపాటు వల్లనే ప్రపంచంలో ఘర్షణలు, అక్రమాలు తలెత్తుతాయి. మీ వాక్కులో ఉన్న ప్రజ్ఞ కేవలం అల్లాహ్‌కే అర్పితం అని మీరు నమాజ్‌లో ప్రమాణం చేస్తారే ! మళ్ళీ అదే నోటితో దైవానికి ఇష్టంలేని మాటల్ని ఎలా అనగలుగుతారు? దైవవాణికి బదులుగా కుఫ్రవాణి ఉన్నతం కావాలని ఆ ప్రమాణం చేసిన నోటితోనే ఎలా అంటారు? ఈవిధంగానే మీరు నమాజ్‌లో మీ శరీర బలం, మీ ధన సామగ్రులు కేవలం దైవారాధనకే, దైవ దాస్యానికే అంకితం అని ప్రమాణం చేస్తారు. ఆ తరువాత దైవేచ్ఛకు వ్యతిరేకంగా, ఇతరుల సేవను, విధేయతను ఎలా పాటిస్తారు? మీ ఆస్తిపాస్తుల్ని అల్లాహ్‌ను కాదని, మీ సంతోషం కోసం, ఇతరుల సంతోషం కోసం ఎలా వినియోగిస్తారు? మీ నోరు, మీ ప్రాణం, మీ ధనం, ఇవన్నీ దేవుని అమానతు.

దైవానుగ్రహం, ఆయన ప్రేమకు తరువాత, మానవులకు అందరికంటే ఎక్కువగా ఎవరు ఉపకారం చేశారో, ఎవరు మేలు చేశారో, మీరెప్పుడయినా ఆలోచించారా? దైవోపదేశాలను మానవాళికి తెలిపిన ప్రముఖ మహనీయులే వీరు. వీరినే మనం దైవసందేశహరులు, ప్రవక్తలు అని అంటాం. ప్రతి యుగంలో మానవుడు దైవప్రవక్తలు కొనితెచ్చిన దైవోపదేశాలను, తన

మనోవాంఛల కోసం, తుచ్ఛ ప్రాపంచిక సుఖాల కోసం త్రోసిపుచ్చాడు. లేదా అందులో మార్పులు చేర్పులు చేశాడు. అలా చేయడం నిజంగా మానవుని దురదృష్టం. కాని దేవుడు కరుణామయుడు కాబట్టే, మానవ జీవితానికి కావలసిన అన్ని ఏర్పాట్లు చేశాడు. మానవుల శ్రేయస్సును కోరే, వారికి కావలసిన సంపూర్ణ జీవిత విధానాన్ని, దేవుడు తన చివరి ప్రవక్త ముహమ్మద్ (సఅసం) ద్వారా పంపాడు. ఈ ధర్మోపదేశం ప్రళయకాలం వచ్చేవరకు తన నిజస్వరూపంలో ఉండేటట్లు ఏర్పాటుచేశాడు. ప్రపంచంలోని మానవులందరికి దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఏవిధంగా కరుణామయుడయ్యాడో గ్రహించండి. ఈ మహా వ్యక్తివల్ల ప్రపంచానికి ఏ మహోపకారం కలిగిందో తెలుసుకోండి, ఈ మహోపకారిని నిత్యం జ్ఞాపకముంచుకోవడం చాలా అవసరం. ఎందుకంటే మన జీవితాంతం ఆయన చూపిన మార్గాన్నే మనం అనుసరించవలసి ఉంది. కనుకనే నమాజ్‌లో కూడా ఆయన కొరకు "దరూద్"ను "సలాం"ను పంపడం అవసరం. వీటిని పంపడం వల్ల, మీ హృదయంలో ఆయనంటే గౌరవం, ప్రేమాభిమానాలు ఉత్పన్నమవాలి. తద్వారా మీ జీవితం కూడా ముహమ్మద్ (సఅసం)కు ఇష్టమైన మార్గంపై సాగుతుంది, తరువాత మీరు మీ కోసం, సజ్జనులైన దైవభక్తుల కోసం శుభశాంతులు అర్థిస్తారు, ఈ విధంగా దైవానుగ్రహానికి అర్హులు, కేవలం సన్మార్గులయిన దైవభక్తులేనని మీరు మీ నోటితో చాటుతారు.

కలిమాను పఠించి మీరు ముస్లిమ్‌లవుతారు. దేవుని ఏకత్వాన్ని ముహమ్మదు (సఅసం) దైవదౌత్యాన్ని స్వీకరించినప్పుడే ఒక ముస్లిమ్ కాని వ్యక్తి ముస్లిమవుతాడు. మీ విశ్వాసం ఎల్లప్పుడు నూతనంగా ఉండడానికి, మీరు విప్లవ భావపూరితమైన ఈ ప్రమాణాన్ని ప్రతి నమాజ్‌లో మరీ మరీ పఠిస్తారు. దీనివల్ల అల్లాహ్ ఒక్కడే మీ యజమానీ, పోషకుడు, ఆరాధ్యదైవం

అనే విషయాన్ని మరువరు. ఇంకా మీ జీవితానికి సంబంధించిన ప్రతి అంశంలో ముహమ్మద్(సఅసం) ఉపదేశాల కనుగుణంగా నడచుకోవాలని గుర్తుంచుకుంటారు. ఆయన దైవ నియమాలను, దైవాదేశాలను మనకు తెలిపిన మహాపురుషుడు. దైవ నియమాలను పాటించడంలో, దైవ దాస్యం చేయటంలో కూడా అగ్రగణ్యుడు.

నమాజ్‌లోని ఆఖరి రకాత్‌లో, మళ్ళీ మీరు ముహమ్మద్(సఅసం)ను ఆయన్ని ప్రవక్తగా విశ్వసించిన వారినందరినీ అనుగ్రహించమని దేవుణ్ణి ప్రార్థిస్తారు.

## దరూద్

సల్లి = కరుణను పంపు, కరుణించు

అల్ = విశ్వసించువారు

కమా = ఏ విధంగానయితే

సల్లయిత = నీవు కరుణను పంపావు, కరుణించావు

ఇన్నక = నిస్సందేహంగా నీవు

హమీద్ = స్తుతింపబడేవాడు

మజీద్ = అత్యంత ఆదరణీయుడు

బారిక్ = శుభాలివ్వు

బారక్త = నీవు ఎక్కువ శుభాలను ఇచ్చావు.

అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదివ్వ అలా ఆలి ముహమ్మదిన్ కమా సల్లయిత అలా ఇబ్రాహీమ వఅలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్మజీద్.

ఓ ప్రభూ ! హజ్రత్ ఇబ్రాహీంను, ఆయన అనుయాయుల్ని నీవు ఏవిధంగా కరుణించావో అట్లే ముహమ్మద్‌ను, ఆయన అనుయాయుల్ని కరుణించు. నీవు స్తుతింపబడువాడవు. మహానుభావుడవు. దీనిలో ఏమాత్రం సందేహం లేదు.

అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మదివ్వ అలా ఆలి ముహమ్మదిన్ కమాబారక్త అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్మజీద్.

ఓ దేవా ! ఏవిధంగానయితే నీవు హజ్రత్ ఇబ్రాహీమ్‌కు, ఆయన అనుచరులకు ఉన్నత స్థానాన్ని, విరివిగా శుభాలను ప్రసాదించావో, అట్లే హజ్రత్ ముహమ్మద్‌కు ఆయన్ని నమ్మిన వారికి శుభాలను ప్రసాదించు.

మీరు చేసే పనులవల్ల, మీ నడవడికవల్ల ముహమ్మద్ (సఅసం) తెచ్చిన ధర్మం అప్రతిష్టపాలయినా లేక మీ ప్రయత్నాలు ఆ ధర్మాన్ని స్థాపించటానికి, ప్రపంచంలో దాని స్థానం ఉన్నతము, ఉత్కృష్టము కావడానికి ఉపయోగపడకపోయినా (దైవం ఆ విధంగా చేయకుండుగాక) అప్పుడు మీరు "దరూద్ సలామ్"లను పంపడం నిష్ప్రయోజనం. ఇవి ముహమ్మద్ (సఅసం)ను ఏవిధంగాను సంతోషపరచలేవు, ముహమ్మద్ (సఅసం) దైవ ధర్మాన్ని మహోన్నతం చేయడానికి, మానవులకు దైవ విధేయతను నేర్పడానికి వచ్చారు, తనకోసం "దరూద్ సలామ్"లను పంపేవారిని తయారుచేయడం ఆయన ఉద్దేశ్యం కాదు. దైవప్రవక్త ముహమ్మద్(సఅసం) పట్ల నిజంగా మీకు ప్రేమ ఉన్నట్లయితే, ఏ లక్ష్యసిద్ధి కొరకు దేవుడు ఆయన్ని పంపాడో, ఆ లక్ష్యసాధనకోసం మీరు అహర్నిశలు కృషి చేయాలి. ముహమ్మద్ (సఅసం) పరమపదించిన తరువాత ఈ కార్య భారం మన అందరి భుజస్కంధాలపై పడింది.

నమాజ్‌ను ముగించే ముందు మీరు మీకోసం ప్రార్థిస్తారు.

# "దుఆ" ★

ఆతినా = మాకు ప్రసాదించు

హసనతన్= మంచిని, శుభాన్ని

ఆఖిరతి = పరలోకంలో

వఖినా = మమ్ము సురక్షితంగా ఉంచు

నార్= నరకాగ్ని

రబ్బనా ఆతినా ఫిద్దునియా హసనతవ్వ ఫిల్ ఆఖిరతి హసనతవ్వ ఖినా అజాబన్నార్.

ఓ మా ప్రభూ ! నీవు మాకు ఈ ప్రపంచంలోనూ పరలోకంలోను మేళ్ళను, శుభాలను ప్రసాదించు, శుభశ్రేయాల్ని అనుగ్రహించు, మమ్మల్ని నరక జ్వాలలనుండి కాపాడు.

ఇప్పుడు నమాజ్ అయిపోయింది. దీని తరువాత మీరు అన్నిటికంటే ముందు మీ ముఖాన్ని కుడి ప్రక్కకు, ఎడమ ప్రక్కకు త్రిప్పుతూ దైవ దాసులందరికి శాంతిశ్రేయాలు కలగాలని ప్రార్థిస్తారు. అంటే "అస్సలాము అలైకుమ్ వరహ్మతుల్లోహ్" అని అంటారు. దీని అర్థం యిదిః మీ అందరిపై శాంతి కలుగుగాక.

రాత్రి నమాజ్ విత్ర్ నమాజ్‌తో అంతమవుతుంది. విత్ర్ నమాజ్ అంతిమ రకాత్‌లో మీ ప్రభువుతో మీరు మరో గొప్ప ప్రమాణం చేస్తారు. దాన్నే "ఖునూత్" అంటారు. ఖునూత్ అంటే, దైవసాన్నిధ్యంలో మీరు మీ నిస్సహాయతను, వినయాన్ని, వినమ్రతను, విధేయతను, దాస్యాన్ని ప్రకటించటం అని అర్థం. దీన్ని ఏ మాటల్లో ప్రకటిస్తారో చదవండి.

---

★ ఇది కాక వేరే "దుఆ" మీకు వస్తే దాని అర్థాన్ని తెలిసినవారిని అడిగి తెలుసుకోండి.

# "ఖునూత్" దుఆ

ఇన్నా = నిస్సందేహంగా మేము

నస్తయీను = మేము సహాయాన్ని అర్థిస్తున్నాము

నస్తగ్ఫిరు = మేము క్షమాభిక్షను వేడుకుంటున్నాము

నూమిను = మేము విశ్వసిస్తున్నాము

నతవక్కలు = మేము భారం మోపుతున్నాము

నుస్నీ = మేము స్తుతిస్తున్నాము

నష్కురు = మేము కృతజ్ఞతలు తెలుపుతున్నాము

యఫ్జురు = అవిధేయత చూపుతుంటాడు

నుసల్లి = మేము నమాజ్ చేస్తున్నాము

నస్జుదు = మేము సజ్దా చేస్తున్నాము

నస్ అ = మేము కృషి చేస్తున్నాము

నహ్ఫిదు = మేము సేవిస్తున్నాము

నర్జూ = మేము ఆశిస్తున్నాము

నక్ఫురు = మేము కృతజ్ఞతను తెలుపుతున్నాము

నఖ్లఉ = మేము వేరౌతున్నాము

నత్రుకు = మేము విసర్జిస్తున్నాం ( వదలుకొంటున్నాము)

నఖ్షా = మేము భయపడుతున్నాము

అజాబ్ = శిక్ష, బాధ

కుఫ్ఫార్ = ఇస్లామ్ను విశ్వసించనివారు

ముల్హిఖ్ = దొరుకును

అల్లాహుమ్మ ఇన్నా నస్తయీనుక వ నస్తగ్ఫిరుక వనూమినుబిక వనతవక్కలు అలైక వనుస్ని అలైకల్ ఖైర్. వనష్కురుక వలా నక్ఫురుక వనఖ్లఉ వనత్రుకు మైయ్యఫ్ జురుక్. అల్లాహుమ్మ ఇయ్యాక న అబుదు వలక నుసల్లి వనస్ జుదు వఇలైక నస్అ వనహ్ఫిదు వనర్జూ రహ్మతక వనఖ్షా అజాబక ఇన్నా అజాబక బిల్ కుఫ్ఫారి ముల్హిఖ్.

"ఓ ప్రభూ ! మేము నిన్ను సహాయం చేయమని అర్థిస్తున్నాము. క్షమాభిక్ష పెట్టమని వేడుకుంటున్నాము. నీపై మాకు సంపూర్ణ విశ్వాసముంది. నిన్నే నమ్ముకున్నాము. నిన్నే స్తుతిస్తున్నాము, నీకే కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము. నీ పట్ల కృతఘ్నత తలపెట్టము.

"నీ మాటను కాదనే వానితో మా సంబంధాలను తెంపుకుంటున్నాము. అలాంటి వానికి మేము దూరంగా ఉంటాము.

"ఓ లోకేశ్వరా! మేము నిన్నే ఆరాధిస్తున్నాము, మేము నమాజ్ చేయటం, సజ్దా చేయటం నీ కొరకే. మేము చేసే కార్యకలాపాలన్నీ నిన్ను సంతోషపరచటానికే, మేము నిన్నే సేవిస్తున్నాము, నీ కరుణను ఆశిస్తున్నాము, నీ శిక్ష అంటే మాకు భయం. నిన్ను ధిక్కరించే వారు నిస్సందేహంగా నీ శిక్షకు గురియౌతారు."

మీరు చేసిన ఈ ప్రమాణాన్ని గురించి ఆలోచించండి. మీ జీవితాన్ని ఓసారి పరిశీలించండి. ఏ సందర్భాల్లో ఏ విషయాల కోసం మీరు దేవుని సహాయాన్ని కోరుతున్నారు? కేవలం కడుపు నింపుకోవడం కొరకా, మంచి ఉద్యోగం దొరికేందుకా, కోర్టులో కేసు గెలువటానికా, వ్యాపారం అభివృద్ధి కావటానికా, సంతానం కావాల్సనా?

లేక

దైవ విధేయులై ఉండటానికా? దైవప్రవక్త అడుగుజాడల్లో

నడిచేందుకా? దైవ ధర్మాన్ని ఉన్నతం చేయడానికా? దైవ మార్గంపై స్థయిర్యంగా నిలబడటానికా? దారితప్పిన తోటి మానవులకు దైవోపదేశాలను తెలుపటానికా? సన్మార్గులయిన ఇతరులకు మార్గదర్శకులుగా నిలపటానికా? దుర్మార్గాన్ని, అన్యాయాన్ని, అధర్మాన్ని రూపుమాపటానికి కావలసిన శక్తిని ప్రసాదించమనా? ఇవి కావాలనే, చేయాలనే ఆశ, ఆవేదన మీ హృదయంలో ఉన్నాయా? వీటికోసం మాటిమాటికీ దైవంపై మనస్సు లగ్నంచేశారా? దైవధ్యానంలో నిమగ్నులయ్యారా?

మీరు దైవాన్ని క్షమాభిక్ష పెట్టమని వేడుకుంటారు. నిజంగా మీరు మీ మటుకు దైవ విధేయులయి జీవించటానికి ప్రయత్నం చేశారా? ఈ మీ ప్రయత్నంలో మీ వల్ల ఏదన్నా లోపం జరిగితే దానికి మీరు సిగ్గుపడుతున్నారా? ముమ్మందు ఆ లోపాలు, పొరపాట్లు జరగకుండా ఉండాలనే స్థిరనిశ్చయంతోనే మీ ప్రభువు సమక్షంలో క్షమాభిక్ష పెట్టమని మన్నింపు కొరకు విలపిస్తున్నారా? ఎవరయితే దైవ తిరస్కారాన్నే తమ దినచర్యగా చేసుకున్నారో, ఎవరయితే దైవాజ్ఞలకు విముఖంగా దైవ విద్రోహుల దాస్యం చేస్తారో, ఎవరయితే దైవం నిర్ణయించిన ధర్మాధర్మముల హద్దుల్ని లెక్కచేయకుండా ఉపాధి సంపాదించు -కుంటారో, దైవ నియమాలను, శాసనాలను తృణీకరించి తామే స్వయంగా నియమాలను, శాసనాలను ఎవరయితే నిర్మించుకుంటారో లేక వాటిని ఇతరుల ద్వారా గ్రహిస్తారో అలాంటి పెద్ద మనుషులు ఈ విధంగా రోజూ దేవుణ్ణి మన్నింపు వేడుకోవటం దేవుడితో పరిహాసం చేయటం కాక ఇంకేమవుతుంది? దేవునిపై సంపూర్ణ విశ్వాసం ఉందని ఆయన్నే నమ్ము కున్నామని మీరు ప్రకటిస్తారు. ఇదే నిజమయితే, ఆయన తప్ప ఇతర కృత్రిమ దేవుళ్ళతో మీకు సంబంధం ఉండటం ఎలా సాధ్యం? మీ పూర్తి జీవితం దైవోపదేశాలకు దైవాదేశాలకు అనుగుణంగానే సాగుతుంది. మీ

దృష్టిలో కేవలం ప్రాపంచిక ఆధారాలు, సహకారాలు జయాపజయాలు కారణభూతమెలా అవుతాయి? ఆయన శక్తిని, ఆయన సహాయాన్ని మీరు నమ్ముకుంటారు, ఇతరుల ఆధారంపై మీరు భరోసాచేయరు.

దైవాన్నే స్తుతిస్తాము, ఆయనకే కృతజ్ఞతలు తెలుపుకుంటాము. కృతఘ్నులై ప్రవర్తించము అని కూడా అంటారు. ఇంత పెద్ద వాగ్దానం చేసిన తరువాత, మీకు దేవుడిచ్చిన అనేక వస్తువుల్ని, ప్రసాదించిన వివిధ శక్తిసామర్థ్యాలను ఆయన ఇష్టానికి వ్యతిరేకంగా ఏవిధంగా ఉపయోగించగలరు? ఆయన అనుగ్రహాలకు కృతజ్ఞతలు తెలుపటమంటే, ఆయన చెప్పిన విధంగా వాటిని ఉపయోగించటమే కదా!

దైవానికి అవిధేయులై జీవించేవారి సాంగత్యాన్ని వదలి దూరంగా ఉంటామని కూడా మీరు ప్రకటిస్తారు. దీని తరువాత దైవమార్గాన్ని త్యజించేవారితో, తెలిసీ దైవాజ్ఞల్ని ఉల్లంఘించే వారితో మీరు హృదయ పూర్వకమయిన సంబంధాల్ని ఏ విధంగా పెట్టుకోగలరు? వారు మీ తోబుట్టువులు, మీ సంతానం, భార్యా భర్త, అధికారి, నౌకరు, మత గురువు ఎవరయినా కానివ్వండి, వారి సాంగత్యం మీకు ఎలా రుచిస్తుంది?

మేము చేసే కార్యకలాపాలన్నీ కేవలం దైవ సంతోషం కోసమే, దైవదాస్యం చేయటానికి మేము నిత్యం తయారుగా ఉంటాము అని ప్రకటిస్తారు. మీ ప్రమాణం, ప్రకటన తరువాత మీ జీవితంలో ఏ ఏ మార్పులు వస్తాయో మీరెపుడయినా ఆలోచించారా? ఇప్పుడు ఇష్టపడి నానా ప్రయాసలుపడి పొందిన అనేక వస్తువులు అప్పుడు అయిష్టకర మయినవిగా మారిపోతాయి. మీకున్న శక్తిసామర్థ్యాలు అన్నీ మరోవిధంగా దైవమార్గంలో వినియోగమవుతాయి.

ఆఖర్లో "ఓ ప్రభూ ! నీవు మమ్మల్ని కరుణిస్తావని మాకు ఆశ ఉంది. నీ శిక్ష అంటే మాకు భయం" అని విన్నవించుకుంటారు. ఇంకా, దైవదాస్యాన్ని దైవ విధేయతను తిరస్కరించేవారు దైవశిక్షకు తప్పక గురి అవుతారు అని కూడా అంటారు. దైవానుగ్రహాన్ని ఆశించే ముందు, మీరు ఏం చేయాలో, దేన్ని స్వీకరించి, దేన్ని విసర్జించాలో మీరే స్వయంగా నిర్ణయించుకోగలరు. మీరు దైవ శిక్షకు నిజంగా భయపడేవారే అయితే దైవాజ్ఞల్ని అతిక్రమించేటప్పుడు, నిప్పులో చేయి పెడుతూ ఎంత భయపడతారో, అంతగా భయపడతారు. మీ పేరు దైవ విద్రోహుల జాబితాలో నమోదయ్యే పని ఏదయినా జరుగుతుందేమోనని ప్రతి నిత్యం శ్రద్ధవహిస్తూ ఉంటారు.

మిత్రులారా ! ఇదే నమాజ్‌లో ఉన్న సారాంశం, పరమార్థం. కనీసం ఒక్క సారన్నా మీరు నమాజ్‌ను అర్థం చేసుకొని చేశారంటే, మీ జీవితంలో మార్పు రాకుండా ఉండటం అసంభవం. అర్థం చేసుకోకుండా, కంఠస్థం చేసుకున్న మాటల్ని నమాజ్‌లో అప్పజెప్పినట్లయితే ఏ ప్రభావము, ఏ ప్రయోజనము ఉండదు.

మీరు అనుదినం చేసే పనులకూ నమాజ్‌కూ మధ్య వ్యత్యాసాన్ని పాటించినంత కాలం నమాజ్ మీకు ఏవిధంగానూ ప్రయోజనకరం కాజాలదు.

ఆలోచించి, అర్థం చేసుకొని దైవ చింతనతో నమాజ్ చేసే భాగ్యాన్ని మనకు దేవుడు ప్రసాదించుగాక ! నమాజ్‌లో మనం అనే మాటలకు, చేసే ప్రమాణాలకు అనుగుణంగా మనం మన జీవితాలను గడిపేలా దేవుడు చేయుగాక, ఆమీన్ ! (దేవుడు ఆ విధంగానే చేయుగాక).

★★

# 4

నిజమైన ముస్లిముల జీవిత చిత్రణ ఇప్పుడు మీ ముందు ఉంది. దైవదాస్యం, దైవభక్తి, దైవ విధేయత వారి జీవితాల్లో తొణికిసలాడుతాయి. ఈ జీవితానికి ప్రాణం నమాజ్.

ఇప్పుడు మీరు ముస్లిముల మరణాన్ని గురించి కూడా తెలుసుకోండి.

ఒక ముస్లిమ్ దృష్టిలో మరణమంటే అంతటితో జీవితం అంతమవుతుంది. ఇక ఆపైన ఏమి జరగదు అని అర్థం కాదు. మరణించిన తరువాత మళ్ళీ బ్రతికింపబడతానని అతని విశ్వాసం. అతడు ఈ ప్రపంచంలో చేసిన మంచి, చెడు పనులను గురించి జవాబు చెప్పుకోవాలి. ఆ పనులకు అనుగుణంగానే తన మరణానంతరం శాశ్వత జీవితం సుఖమయం కావడమో, దుఃఖపూరితం కావడమో ఆధారపడి ఉంది. ఇహలోక జీవితం, పరలోక జీవితం కొరకు సంపాదించుకునే కాలం వంటిది. అందువల్లనే ఒక ముస్లిమ్ చనిపోయినప్పుడు, అతని కోసం గుండెలు బాదుకుంటూ ఏడవడం, అతనికి మరణం మహావిపత్తు అని తలచడం ఇస్లామ్‌కు వ్యతిరేకం, విలపించే బదులుగా మీరు "మా సోదరుడు ఇప్పటి దాకా మాతో ఉన్నాడు. ఇక శాశ్వతమైన జీవితాన్ని గడపటానికి మానుండి సెలవు తీసుకున్నాడు" అని అనుకోవాలి, ఈ ఎడబాటువల్ల కొద్దో గొప్పో విచారం కలగటం సహజం. కాని పెడబొబ్బలు పెట్టుకుంటూ ఏడవడం, తలవెంట్రుకలు పీక్కోవటం, బట్టలు చింపుకోవటం ఏమాత్రం తగదు. ఈ సందర్భంలో మనం "దేవుడు మా ప్రభువు, యజమాని, ఆయన ఇష్టానికి శిరసావహించడం మా కర్తవ్యం" అని గుర్తుంచుకోవాలి. మరణించిన మన సోదరునికి మనం చేయగలిగిన

సహాయమేమంటే, మనం మన ప్రభువుతో, మన సోదరుడు తన జీవితంలో అజాగ్రత్తవల్ల అమాయకత్వం వల్ల ఏవైనా తప్పులుచేస్తే వాటిని క్షమించి, అతణ్ణి కరుణించమని ప్రార్థించడం.

ఈ ప్రార్థననే "జనాజా నమాజ్" అంటాము. చనిపోయిన మీ సోదరుణ్ణి మీరు పరిశుభ్రంగా స్నానం చేయించి కొత్తబట్టల్లో చుట్టి, శాశ్వతంగా అతనితో వేరయ్యేటప్పుడు మీరంతా ఒకచోట కూడి అతని కోసం ప్రార్థించటానికి పంక్తుల్లో నిలుచుంటారు, మీ నుండి ఒకరు ఇమామ్ (నాయకుడు) అవుతారు. మీ సోదరుని మృతకళేబరం మీ అందరిముందు ఉంచబడుతుంది. "అల్లాహు అక్బర్" అని చేతులు కట్టుకుంటారు. గౌరవభావంతో నిలుచనే మీరు మీ ప్రభువును స్తుతిస్తారు(సనా), నమాజ్‌లో కూడా ఈ "సనా"(స్తోత్రం)నే మీరు నేర్చుకున్నది. మళ్ళీ "అల్లాహు అక్బర్" అని దైవ ప్రవక్త ముహమ్మద్(సఅసం) కొరకు నమాజ్‌లో చేసిన విధంగానే "దరూద్ సలామ్" అను పంపుతారు. మళ్ళీ "అల్లాహు అక్బర్" అని "దుఆ" చేస్తారు.

## జనాజా దుఆ

ఇగ్‌ఫిర్ = క్షమాభిక్ష పెట్టు

హయ్ = బ్రతికి ఉన్న

నా = మా వారు

మయ్యిత్ = మరణించినవాడు

షాహిద్ = హాజరయిన వారు, ఉన్నవారు

గాయిబ్ = అక్కడ లేనివారు

సగీర్ = చిన్నవారు

కబీర్ = పెద్దవారు

జకరి = పురుషుడు, మగవాడు

ఉన్స = స్త్రీ

ఇస్లామ్ = విధేయత

అహ్యైత = నీవు సజీవంగా ఉంచిన వారిని

మిన్నా = మా నుండి

అహ్యి = సజీవంగా ఉంచు

తవప్పైత = నీవు మృత్యువు నిచ్చే వారిని

అల్లాహుమ్మగ్ ఫిర్‌లి హయ్యినా వమయ్యితినా వషాహిదినా వ గాయిబినా వ సగీరినా వ కబీరినా వ జకరినా వ ఉన్‌సానా అల్లాహుమ్మ మన్ అహ్యైతహు మిన్నా ఫ అహ్యిహి అలల్ ఇసామి వమన్ తవప్పైతహు మిన్నా ఫ తవప్పహు అలల్ ఈమాన్.

ఓ లోకేశ్వరా ! సజీవులై ఉన్న మా వారిని, దివంగతులయిన మా వారిని, ప్రస్తుతం ఇక్కడ ఉన్నవారిని, లేనివారిని చిన్నవారిని, పెద్దవారిని, పురుషులను, స్త్రీలను - కరుణించి, క్షమించు. దైవమా ! నీవు మాలో ఎవరినయితే సజీవంగా ఉంచనున్నావో, వారిని నీ మార్గంపై విధేయులై ఉండునట్లు చెయ్యి. నీవు మాలో ఎవరికయితే మృత్యువు ఇవ్వనున్నావో వారికి, వారి విశ్వాసం సవ్యంగా ఉన్నప్పుడు మృత్యువు నివ్వు.

మీరు ఈ ప్రార్థనలో కేవలం చనిపోయిన వ్యక్తికోసమే కాదు సజీవులై ఉన్నవారు, పరమపదించినవారు, హాజరయినవారు, హాజరు కాలేకపోయినవారు, పురుషులు, స్త్రీలు, పిన్నలు, పెద్దలు అందరి తప్పులను క్షమించమని దైవానికి వేడుకున్నారు. అంటే మీరు తమ మేలును అర్థించడంతో పాటు మీ తోటివారి మంచికోసం ప్రార్థించారు. మీరు కూడా ఇదేవిధంగా ఏదో ఒక

రోజున మరణించవలసి ఉన్నదని, దైవ సమక్షంలో హాజరుకావలసి ఉన్నదని గ్రహించారు. దీని తరువాత మీరు సజీవులై ఉన్నంతవరకు దైవ విధేయులయి జీవిస్తూ ఉండాలని, మరణించేటప్పుడు ఆయన ధర్మంపై విశ్వాసంతోనే మరణించాలనీ ప్రార్థించుకున్నారు. ఈ విధంగా ఈ ప్రార్థన కేవలం మరణించినవారి మంచి కొరకు దైవంతో వేడుకోవటమే కాక మన్నింపు ప్రార్థనగా, విషయాలను గుర్తుచేసే మేలుకొలుపుగా, మనం చేసే దైవ దాస్య ప్రమాణంగా కూడా రూపొందుతుంది.

మళ్ళీ మీరు "అల్లాహు అక్బర్" అంటారు. ముందు కుడిప్రక్కకూ తరువాత ఎడమ ప్రక్కకు మీరు మీ ముఖాన్ని త్రిప్పి సలాం చేసి ముగిస్తారు. (ఇతర నమాజుల్లో చేసిన విధంగానే).

★★

# జీవితానికి వెలుగుబాట

# "నమాజ్"

"చిత్తశుద్ధితో నమాజ్ చేసే ఏ మనిషి దుష్కార్యాలను చేయజాలడు. నమాజ్ చేసే వ్యక్తి దుర్గుణాలకు, లోపాలకు అతీతుడుగా ఉండకపోతే అతడు చేసే నమాజ్ కేవలం సంప్రదాయకమయినది. ఆలోచించకుండా, అర్థం చేసుకోకుండా చేసే నమాజ్ ఒక ఆచారంగా మాత్రమే ఉండిపోతుంది. దీని వల్ల ముస్లిం సోదరులకు కలుగవలసిన ప్రయోజనం కలుగదు.

అరబ్బీ, ఉరుదు భాషలు రానివారు, వాటి లిపి ఎరుగని వారి సౌకర్యం కోసం తెలుగులో ప్రచురించిన ఈ చిన్న పుస్తకం "నమాజ్" ప్రచురణకర్తలు ఆశించినట్లు అందరికీ ప్రియతమం కాగలదు."

ఆంధ్రజ్యోతి
సచిత్ర వారపత్రిక
విజయవాడ